# గ్రంథాలయ గీతాలు

"పాడిబాన గ్రంథాలయ మేరు నిల్పి
నాలొః దివ్య ముహూర్తమునందుఁ దొల్లి;
నాటఁగోలె సుధాప్రపూర్ణమ్ముగాఁగఁ
దనరినది నేటిదనుక—మీదట నెటుండొ?"

సంకలనము

పాతూరి నాగభూషణం, డి. యల్. యస్.

ద్వితీయ ముద్రణము
1000 ప్రతులు

విడుదల
1–3–1961

ప్రకాశకులు

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము

పటమట :: కృష్ణాజిల్లా

సర్వోదయ ప్రెస్
పటమట, కృష్ణాజిల్లా

వెల
రు ౧. ౫౦

స్వర్గీయ

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి

స్మృతిచిహ్నముగ

వారి ప్రథమ వర్థంతి సమయమున

భక్తితో సమర్పించుకొన్న

కానుక

"అన్ని చదువులు గ్రంథాల నమరుకతన
గ్రంథమున కక్షరమె ప్రాణకందమగుట
నక్షరజ్ఞాన మందర కందజేయు
దీక్షబూనుడు చదివిన దిట్టలెల్ల."

— శ్రీ హరిసర్వోత్తమరావు

# పీఠిక

పంద్రెండేళ్ల క్రితం గ్రంథాలయాలపరంగా జరిగే సభలు - సమావేశాలలో పాడుటకు పనికివచ్చునట్టి గీతాలను, పద్యాలను, కీర్తనలను సేకరించి నాటి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు, సుప్రసిద్ధ దేశభక్తులునగు పూజ్యశ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్తి ప్రచురణలలో నాలుగవ కుసుమముగ 'గ్రంథాలయ గీతాలు' తొలిముద్రణము వెలువడినది. దీనికి పిమ్మట గత పంద్రెండేండ్లలోను సరిక్రొత్తగీతములు కొన్ని తయారై అప్పుడప్పుడు గ్రంథాలయ సర్వస్వములో ప్రకటింపబడుచువచ్చినవి. మొదటి ముద్రణపు ప్రతులు వ్యయమై పోయినందునను, ఈ గ్రంథమునకు మంచి ఆదరణ లభించినందునను, గ్రంథాలయాల కార్యకర్తలకు, ఉద్యమ నిర్వాహకులకు ఇది ఉపయుక్తముగా కనబడినందునను తిరిగి దీనిని వెలువరించుటకు పూనుకొన్నాము.

ఎక్కువగా ప్రచారమునకు రాని లోగడ కూర్పులోని కొన్ని రచనలను తగ్గించి నూతన రచనలను కొన్నింటిని చేర్చి ప్రస్తుత ముద్రణను సిద్ధము చేయబడినది. ఈ తూరి మన సంప్రదాయానుసారము సరస్వతీ ప్రార్థన ముందు చేర్చబడినది. 'విద్య' యను శీర్షికను క్రొత్తగాచేర్చి గ్రంథాలయముల శీర్షికను పుస్తకములు, గ్రంథాలయములు అని రెండుగ విభజించడమైనది. ప్రార్థనశ్లోకములు, కీర్తనలు, పద్యములకు పిమ్మట జాతీయగీతములు కొన్ని యివ్వబడినవి. తరువాత వరుసగ ౧. విద్య, ౨. పుస్తకములు, ౩. గ్రంథాలయములు, ౪. వయోజన విద్య అను నాలుగు ప్రధాన శీర్షికలక్రింద వివిధ రచయితల రకరకముల రచనలు పొందు పరుపబడినవి.

## అంకితము

1960 వ సంవత్సరం ఫిబ్రవరి నెలాఖరున శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు పరమపదించినారు. ఏకగ్రీవంగా వారు మా సంఘమున కిరువది యైదేండ్లు అధ్యక్షులుగ నుండి దీని కార్యక్రమాన్ని దిగ్విజయంగా నడపినారు. నిర్విరామమైన వారి కృషి ఆంధ్రదేశానికి అనేకరంగాలలో అర్ధశతాబ్దికి పైగా లభించినది. వారి నిరాడంబరత, స్వార్థరాహిత్యము

ఎందరెందరినో ప్రోత్సహించి దేశసేవకు పురికొల్పినది. రాజకీయాచార్యుడుగ, ప్రజల పండితుడుగ, గ్రంథాలయ నేతగ, వయోజన విద్యాబోధకుడుగ వారికీర్తి భారతదేశమంతటను వ్యాపించినది. గ్రంథాలయ, వయోజన విద్యారంగములలో వారు కోరకుండగనే ప్రజలలో, ప్రభుత్వములో, ఆంధ్రదేశంలో, భారతదేశంలోకూడ నాయకత్వం లభించినది. వారి సర్వశక్తులు ప్రజాసామాన్యంలో విద్యావ్యాప్తికొరకు సమర్పితమైనవి. ఓపికలేని స్థితిలోకూడ వారు ప్రచారము నిమిత్తం ప్రయాణములను చేసిరి. మరణశయ్యపై నుండికూడ వారిదే విషయమై పలవరించుచుండిరి. ఇట్టి మహనీయుని గౌరవించుట మన విధిగదా? కనుకనే వారు జీవించియుండగనే వారి సేవను మేము గుర్తించిన దానికి చిహ్నముగా ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి పుట్టినిల్లగు విజయవాడలో నొక గట్టి యింటిని కట్టి దీనికి వారిపేరు పెట్టుకొంటిమి. ఇదే శ్రీ సర్వోత్తమ భవనము. మా సంఘ కార్యస్థానము.

వారి మరణానంతరము 1960 మార్చి నెలలో వారి స్మృతి చిహ్నముగ గ్రంథాలయ సర్వస్వము ప్రత్యేక సంచికను ప్రచురించినాము. వారి రచనలను వరుసగ ప్రకటించదలపెట్టి ఇటీవలనే 'సభలు - సమావేశములు' ద్వితీయ ముద్రణమును వెలువరించినాము. ఇప్పుడు వారి ప్రథమ వర్ధంతిని పురస్కరించుకొని వారి కత్యంత ప్రీతిపాత్రమైన ప్రచార కార్యక్రమాని కుపకరించు 'గ్రంథాలయ గీతాల'ను తిరిగిముద్రించి ప్రచురించుచున్నాము. మాకు వారిపట్ల గల భక్తి నీవిధముగ వెల్లడించుకొనుట కవకాశము కల్పించిన భగవంతునికి ముందు మా నమోవాకముల నర్పించుచున్నాము.

## కృతజ్ఞత

మా బంధుకోటిలోని వారగు కీ. శే. పండిత వడ్లమూడి వేంకటరత్నముగారు ఈ గ్రంథం మొదటికూర్పుకు పరిచయం వ్రాస్తూ వెలువరించిన భావములు జ్ఞప్తి చేసుకొన దగినవిగ నున్నవి. వారానాడు మాకిచ్చిన ప్రోత్సాహము మరువరానిది.

ఈ గ్రంథమును గూర్చి వారిట్లు వ్రాసినారు:

"దీనిలో ధ్వని ప్రధాన కావ్యఖండాలు మొదలు తందాన పాటలు వరకు వున్నవి.

"దేశభక్తిని, భారతమాత ఆంధ్రమాతల మహాత్మ్యాన్ని ప్రబోధించుచు, ఉద్రేకం కల్గించే జాతీయగీతాలు, గ్రంథాలయోద్యమానికి సంబంధించిన సమస్త విషయాలను ప్రబోధించే గీతాలు, వయోజన విద్యను ప్రోత్సహించే గీతాలు, అన్ని విషయాలమీద పద్యాలు నిండి ఉన్నవి. ఇవి ఒక్కొక్కటి మనోహరం అయిన భావాలతో, మృదువయిన శబ్దాలతో శ్రావ్యంగా పాడుకోవడానికి వీలయిన ఫణుతులతో రచించబడి ఉన్నవి.

"ఆంధ్రులు ఈ గీతాలకు తగిన ఆదరణ మిస్తారనీ, దానివలన నాగభూషణంగారికి ముందుకుసాగడానికి ప్రోత్సాహంకల్గుతుందనీ, కొలదికాలంలోనే మరొక ముద్రణం అవసరమవుతుందనీ, అప్పుడింకా యిది పెరుగుతుందనీ నా జోస్యం."

ప్రస్తుత ముద్రణలో చేర్చిన రచనలలో ఎక్కువభాగం శ్రీయుతులు కవి, గాయకులు శ్రీ శిష్ట్లా సత్యనారాయణరాజశేఖరం, గ్రంథాలయ సేవకులు శ్రీ రేమిడిచర్ల వెంకట కృష్ణారావు, మధుర కవులు శ్రీ నాళము కృష్ణారావుగార్లవి. ఇందు మొదటివారు శ్రీ సర్వోత్తమ భవనముపై నిర్మింపబడిన బాపూజీ మందిర ప్రారంభోత్సవ శుభ సమయమున తమకై తాము 100 గేయములు గ్రంథాలయ పరంగా వ్రాసియిచ్చుటకు వాగ్దానముచేసి దీనికి అప్పుపత్రమును పంపినవారు. ఇందులో ఇప్పటికి అసలులో దాదాపు నాల్గవవంతు బాకీని వీరు తీర్చుకొన్నారు. రెండవవారు ఖమ్మం జిల్లా మధిరలో మేము నిర్వహించిన వయోజన విద్య తాత్కాలిక శిక్షణ శిబిరములో తాము పొందిన అనుభవముతో ఉత్తేజమునొంది 'అక్షరగీతాలు' అను శీర్షికతో చిన్న పుస్తకమును సిద్ధముచేసిన కార్యశూరులు. తమ స్వగ్రామమగు రేమిడిచర్లలో స్వయముగ గ్రంథాలయమును నిర్వహించుచు మధిరతాలూకా గ్రంథాలయ సంఘమును నెలకొల్పి దీని కధ్యక్షులుగనుండి నడుపుచున్న ఆదర్శ సేవకులు. మాకు మిగుల సన్నిహితులు. ఈ గ్రంథములోని వారి గీతాలు చాలవరకీ పుస్తకమునుండి సంగ్రహించినవే. మూడవవారు జగమెరిగిన బ్రాహ్మణులు. మాకు యావజ్జీవ గౌరవ సభ్యులు. మా సంఘమునకు మొదట కొన్నాళ్లు కార్యదర్శిగనుండి గ్రంథాలయోద్యమ వ్యాప్తికి విశేషముగ కృషి సల్పినవారు. ఆంధ్రదేశం

లోని గ్రంథాలయాలకు శిరోభూషణ మన దగిన రాజమహేంద్రవరము నందలి గౌతమీ గ్రంథాలయ స్థాపకులు.

మిగిలిన వారిలో కీర్తిశేషులు కొందరు; సజీవులు కొందరు. వీరందరు దేశసేవలో, సాహిత్యసేవలో, విద్యాసేవలో, గ్రంథాలయసేవలో జీవితం ధారవోసిన వారు. చిలుకపలుకులవలెగాక అనుభవయుక్తముగా వీరు తమ తమ అభిప్రాయాలను సుస్థిరమైన పదములలో సుందరముగ వెల్లడించి యున్నారు. వీరందరికీ మేము సర్వదా, సర్వథా కృతజ్ఞులము.

ఈ గ్రంథ ముద్రణములో మేము కృతజ్ఞతను తెలుపుకొనదగినవారు మరికొందరున్నారు. ఇందలి రచనలలో వివిధగ్రంథములు, పత్రికలనుండి సేకరించినవి కొన్ని గలవు. కనుక వీటి ప్రచురణకర్త లందరికీ మేము మా వందనములను తెలుపుకొనవలసి యున్నది. గ్రంథవిస్తర భీతిచే వీరి పేరుల నిచ్చుట ప్రస్తావించుట లేదు. ఈ కార్యములో మాకు హెచ్చుగా నుపయోగించిన గ్రంథాలయ సర్వస్వము స్థాపకులు, ఆంధ్ర గ్రంథాలయోద్యమపితామహులునగు శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారు మా ప్రత్యేక కృతజ్ఞతకు పాత్రులు.

తీరని పనులలోనుండియు కోరినంతనే ఈ గ్రంథమునకు పరిచయము నువ్రాసియిచ్చుట కంగీకరించి ఈపనిని పూర్తిచేయుట ద్వారా మాకు సంతోషమును కలుగజేసిన పెద్దలు శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి సహాయము మాకమూల్యమైనది. దీనికిగాను వీరిని మేము సదా సంస్మరించుకొందుము.

ఈ పుస్తకం అట్టపై బొమ్మను వేసిన యువచిత్రకారులు శ్రీ వి. కామేశ్వరరావుగారు, దీని బ్లాకును సరఫరాచేసిన 'విశ్వకర్మ' పత్రిక సంపాదకులు శ్రీ ద్రోణాదుల పుల్లయ్యాచార్యులుగారు, దీనిని ముచ్చటగముద్రించి సకాలమున కందించిన సర్వోదయప్రెస్ నిర్వాహకులు, కార్యకర్తలుకూడ మాకు వంద్యులు.

ఇట్లు విన్నవించు,

శ్రీ సర్వోత్తమభవనము
పటమటలంక
22—2—1961

పాతూరినాగభూషణం
సంకలనకర్త

# పరిచయము

ఈ శతాబ్దియొక్క ప్రథమ దశలో తలయెత్తిన బహువిధ జాతీయోద్యమములలో గ్రంథాలయోద్యమము ఒకటి. ఏ యుద్యమ వ్యాప్తికైనను ప్రజల విద్యా సంస్కారము ముఖ్యాధారము గనుకను, ఆనాడు మన ప్రజలు నేడువలె చెప్పుకొనదగినంత విద్యావంతులుకారు గనుకను, వారికి గ్రంథాలయముల ద్వారా ప్రపంచ జ్ఞానము కల్గించి దేశాభిమాన దీక్షితుల జేయవలెనని కొందరు పెద్దలు పట్టణములలోను, పల్లెలలోను పుస్తక భాండాగారములను నెలకొల్పి, పుస్తక పఠనావశ్యకతను ప్రబోధింప పత్రికలను స్థాపించి, ఉపన్యాసము లిప్పించి ఉత్సవములుచేసి ఒక నూతన సారస్వతాపేక్షను వెల్లివిరియించిరి. ఆ యుద్యమములో తెలుగునాట ఆవిర్భవించినదే గ్రంథాలయ సర్వస్వమనెడి సుప్రసిద్ధ సారస్వత పత్రిక. దాని నిర్వహణ భారము వహించిన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు తదుద్యమముతో తాదాత్మ్యముపొంది కడు సమర్థతతో వ్యవహరించిరి. ఆయనకు సమకాలికులుగానో, తరువాత కొంతకాలమునకో స్వర్గీయ శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఈయుద్యమమున ప్రవేశించి జీవితాంతము వరకు దాని చరితార్థత కొరకే పురుషకారము చేయుచుండిరి. ఆయనయే ఆంధ్ర గ్రంథాలయోద్యమ వ్యాప్తికి మూలస్తంభమనియో, పితామహుడనియో బ్రహ్మయనియో పిలవదగిన మహాపురుషుడు. ఆయన శిష్యుడు, అనుచరుడు, శ్రీ పాతూరి నాగభూషణం

గారు. ఈ శిష్యుడు, ఆ గురు ఋణ మీగుటకై గురువు పేర ఒక గ్రంథాలయ భవనమును కట్టించుటయు, గురూపదేశములను తు, చ, తప్పకుండ ఆచరించుచు ఆ యుద్యమనిర్వహణ భారము వహించుటయు తటస్థించినది. గ్రంథాలయోత్సవ సందర్భములలో ప్రబోధోచితములైన పాటలు, పద్యములు సంతరించి ఈ గ్రంథరూపమున ప్రచురించుటయు ఆ నాగభూషణంగారు సలిపెడి ప్రచార పద్ధతులలో నొకటి.

ఈ గ్రంథమున బమ్మెరపోతనగారి సరస్వతీ ప్రార్థనా పద్యము మొదలు అత్యంతాధునికుల ప్రబోధగేయములవరకు సంకలితములైనవి. ఈ పద్యములు, పాటలు రచించినవారు కొద్దియో, గొప్పయో కవిత్వశక్తి కలవారేగాని అసమర్థులు గారు. కావుననే ఈ పద్యములు, గ్రంథాలయోత్సవ సందర్భములలో పఠింపబడినప్పుడు శ్రోతలకు హృదయంగమములై చిత్తములను ఆవర్జించి ఉద్యమాభినివేశము కల్గించునని ప్రకటన కర్తలు ఆశించిరి. వారికోర్కె సఫలమైన దనుటకు ఈ పుస్తకము రెండవ ముద్రణకు వచ్చుటయే నిదర్శనము. మరి మూడవ ముద్రణముకూడ పడుగాక.

ఈ ఉద్యమ బ్రహ్మయైన శ్రీ హరిసర్వోత్తమరావు గారికి ఇది అంకితమగుట ఈ చిన్ని పుస్తకమునకు పూజ్యత తెచ్చిన యింకొక యంశము.

విజయవాడ
10—3—61

పింగళి లక్ష్మీకాంతం

# విషయ సూచిక

## ౨. పుస్తకములు



## ౩. గ్రంథాలయములు

# విషయ సూచిక

# విషయ సూచిక

# విషయ సూచిక

ఉ॥ క్షోణితలంబు నెన్నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీక చయ సుందర వేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ చిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తకరమ్య పాణికిన్॥

శా॥ తల్లీ నిన్నుఁ దలంచి పుస్తకము చేఁ తం బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షీ సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా.

— పోతన

ఉ॥ జ్ఞానముకన్న మేల్ధనము గానగరాదు ధరాతలంబునన్
దానికి సాధనంబయి గనంబకు విద్దియ గ్రంథమందిరా
ధీనముగాన నాంధ్రులకు దీనియవశ్యత నచ్చజేసి వి
జ్ఞానముగూర్చుమంబ! యనిశంబును దేశ్యభివృద్ధిగాంచగన్

— శ్రీ జంధ్యాల వెంకటశివకవులు

వందనం,
అమ్మా! వందనం,
అందరకును చదువులిచ్చి
ఆదరించు ఆదిశక్తి!

# విషయ సూచిక

లోకమతసుమముల అ – శోకవనమునకు
రాకాసితాండవమె – రక్షమైపోయె!
కల్లమొగ మెఱుగని – గ్రామసుందరికి
కపటనాటకమె శ్రృం – గారమైపోయె॥ మేలుకో॥

స్వేచ్ఛైక జీవుల – స్వర్గవాసముతో
స్వాతంత్ర్య వాయువులె – సన్నగిలిపోయె।
తత్త్వమూర్తులుగన్న – ధ్యాన మందిరములో
తారతమ్యపుదుమ్ము – పేరుకొనిపోయె॥ మేలుకో॥

పారతంత్ర్యపుటిరులు – పడమటకు నడిచె।
తూరుపున స్వాతంత్ర్య – భాను డుదయించె।
పీడకలల యుగము – దాటిపోయెనురా
నేడు నీయింటిలో – నీవె రాజువురా॥ మేలుకో॥

— శ్రీ శిష్ట్లా సత్యనారాయణరాజశేఖరం

## వందే మాతరం

సుజలాం సుఫలాం మలయజశీతలాం
సస్యశ్యామలాం మాతరం ॥వందే॥
శుభ్రజ్యోత్స్నా పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥వందే॥

— శ్రీ బంకించంద్ర ఛటర్జీ

# విషయ సూచిక

ఆరాటంబులు పెట్టెడిపరులకు
నడలక ఘనజయ మందెదము ॥వం దే॥

వేదములు ధనుర్వేదంబులు ధన
వేదంబులు పఠియించెదము
భూదేవులవలె జగమున సౌఖ్యము
పుణ్యంబును వెదజల్లుదము ॥వం దే॥

భారత దేశపు కీర్తిని దిక్కుల
ప్రబలెడిరీతిని జేయుదము
చేరి విదేశీయులు మనతల్లికి
చేతులు మోడ్చగ జేయుదము ॥వం దే॥

— శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ

## దే శ భ క్తి

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్ ౧.

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్
తిండికలిగితె కండగలదోయ్
కండగలవాడేను మనిషోయ్! ౨.

యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్ ?

# విషయ సూచిక

చెట్టపట్టాల్ పట్టుకొని దే
శస్థులంతా నడువవలెనోయ్,
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్. ౯

*

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్,
నరులచెమటను తడసి మూలం,
ధనంపంటలు పండవలెనోయ్ ! ౧౦

ఆకులందున అణగిమణగీ
కవితకోకిల పలకవలెనోయ్ !
పలుకులనువిని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్ ! ౧౧

— శ్రీ గురజాడ అప్పారావు

## తెలుగుతల్లీ !

తెలుగుతల్లీ !
ఓ
తెలుగుతల్లీ !

పల్లెపల్లెను బడులు
పిల్ల పెద్దలకొరకు
విలసిల్లి నీ యూళ్లు
వెలుగొంద జేయాలి ! తెలుగుతల్లీ!

# విషయ సూచిక

# ౧. విద్య

[౧]

సీ. కమనీయ విద్య దాఁ గామధేనువు భంగి
  గామితార్థంబులు గలుగఁ జేయు
సజ్జన విద్వాంససంఘంబు లోపల
  మానుగాఁ దనుఁ బెద్ద మాన్యుఁ జేయు
నెన్ని దేశంబుల కేఁగిన సాయమై
  తల్లి చందంబునఁ దన్నుఁ బ్రోచుఁ
బన్నుగాఁ దన పుణ్యాపాపంబు లెఱిఁగించు
  సాధించు నిహపర సాధనంబు

తే. నగ్నిఁ గాలదు రాజుల కలవిగాదు
నీళ్లనానదు చోరులపాలు గాదు
సోదరులచేత నెప్డుఁ బంచుకొనరాక
చెలఁగు విద్యాధనమునకుఁ జేటులేదు.

— శ్రీ దూబగుంట నారాయణకవి

[౨]

ఉ. హర్తకుగాదు గోచర మహర్నిశమున్ సుఖపుష్టిసేయు స
త్కీర్తి ఘటించు విద్యయను దివ్య ధనం బఖిలార్థికోటికిం
బూర్తిగనిచ్చినన్ బెరుగు బోదు యుగాంతపువేళనైన భూ
భర్తలు తద్ధనాధికులపట్టున గర్వము మాను టొప్పగున్.

# విషయ సూచిక

[౪]

ప్రకృతము నందుపాస్యమగు భారతి నీకిఁకముం దపూర్వమౌ
నొకధన కోశమై యచట నుండెడు విద్దియయున్ ధనమ్ము నీ
వొకరికి చెంతగా నిడెదవో యిఁక నంతగ వృద్ధియౌచు వే
ఱొకరికి నీక యెంతడచె, దో యిఁక నంత హరించిపోయెడిన్.

ఏవిధమైన సంశయమునేనిఁ దొలంచు, నెఱుంగరాని యె
న్నో విషయమ్ము లెట్టెదుట నుంచును, ఈకనులన్న కన్నులే
గా వొక శాస్త్రమన్నదియె కన్ను, నిజమ్మన కద్ది లేనిచో
నీవునుగూడనంధుఁడవె యీశ్వరుఁడిచ్చిన కన్నులుండియున్.

ఒరులు హరింపగా నలవియో, వెలయింతని నిర్ణయింపఁ గా
దరమొ, క్షయించి పోయెడినొ, దానము లెన్నియొనర్చినన్ మహా
త్తరము గదయ్య, విద్యయను ద్రవ్యము ద్రవ్యము లన్నిటన్ నిరం
తరమును తద్ధనార్జన మొనర్ప యతింప గదయ్య బాలకా!

— శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి

[౫]

విద్యధనమిచ్చు, సత్కీర్తి నెలయఁ జేయు
బంధుమిత్రుల సమకూర్చు, పదవులొసఁగు
ఐహికాముష్మిక సుఖంబులందఁ జేయు;
తివిరి మనుజుడు విద్య సాధింపవలయు.

# విషయ సూచిక

భటుల సాయములేకున్న బరులఁ బాఱ
ద్రోలఁగాఁ జాలకుండు భూపాలకుండు,
స్వీయశక్తి నొరుల నోడఁ జేయనోపు
సత్కవీంద్రుని కెట్టులు సాటివచ్చు ?

తనదు రాజ్యమునందు మాత్రమ్మె గౌర
వింపబడుచుండునట్టి పృథ్వీతలేంద్రుఁ
డెల్ల రాజ్యములం దాదరింపఁబడెడి
సత్కవీంద్రున కెట్టులు సాటివచ్చు?

పాత్రులకు నిచ్చుకొలఁదిని బాగుపడెడి
యర్థకోశములుండెడి యవనిధవుఁడు
పాత్రులకునిచ్చు కొలఁదిని బాగుపడెడి
యర్థ కోశమ్ములంగల్గి యలరునట్టి
సత్కవీంద్రున కెట్టులు సాటివచ్చు ?

కటకటంపడి ప్రజలిచ్చు కాసుఁదీసి
కొనుచు నలరెడు కోణీశుఁ డనఘ మోద
మున జనులొసంగు ధనమును గొనుచునెగడు
సత్కవీంద్రున కెట్టులు సాటివచ్చు ?

ఆట వెలఁదుల యాటలకై ధనమ్ము
వెచ్చపెట్టుచు నుండెడి పృథివినాథు
డాటవెలఁదుల నూరక యాడఁజేయు
సత్కవీంద్రున కెట్టులు సాటివచ్చు ?

# విషయ సూచిక

శ్రీని వాణిని వేర్వేర । సేవసేయ
నమరు ఫలమున భేదమెంతైనఁగలదు.
శ్రీ మనకు సౌఖ్యమును దరి । జేరనీదు
వాణి తత్సౌఖ్యమునె యన । వరత మొసఁగు
నెంతగొల్చిన భారతి । నంతసుఖము.
కొలువఁ గొలువంగ లక్ష్మిని । గోరికలకు
హద్దులేకుండు సుఖమన్న । యదియె సమయు
నాశహెచ్చ మనశ్శాంతి యరయనగునె ?
శ్రీనుపాసింప నైహిక । శ్రీ లెసంగు
బలుకుబడి జెల్లు; వృద్ధియౌఁ । జలముబలముఁ;
గాని స్వాతంత్ర్యమనునది । గానరాదు.
దేనికో యొక్కదానికి । వానివీని
సాయ మాసింపవలె దాన । సమయుస్వేచ్ఛ.
వాణి యారాధనంబున । వరలు స్వేచ్ఛ
యనుపద మొకింత యజ్ఞాన మడఁగుచుండు
దాన నాముష్మికసుఖంబు । దరిని మెలఁగు
నుభయ సేవకులకును లో । ట్లుండవచ్చు;
సహజముగ నుండునవి మనుష్యప్రకృతికిఁ
గాని శ్రీ సేవచే వృద్ధి । గాంచు నవ్వి
క్షైణ్యమందు వాణీ కటా । క్షంబువలన
ఉభయులనుగూడ సేవించు । టొక్కసారి
నిప్పునకు నీటికిని జెల్మి । నెఱపఁగనుట
అత్త కోడండ్ర కొకసారె । యాధిపత్య
మియ్యఁబూనుట; అత్త శ్రీ । యని వచింత్రు

ఆమె యెప్పుడైన వాణిత । న్ననుసరింప
నియ్యకొను నొక్కపతౌన । నెట్టులైన;
వాణిమాత్రము శ్రీ యను । వర్తనంచు
నొల్లకుండెడు; గోడలి । వల్ల సౌఖ్య
మత్తయాసించుటయుఁ గల । దప్పుడప్పుడు.
చల్లగను గోడలుండు టి । ష్టంబె యత్త
కత్తపాడ మాత్ర మొక్కప్పు । డైనఁగాని
కోడలికి గిట్టదు; మదిని । గోరుచుండు
నామె బానిసవలెను ద । న్ననుసరించి
బ్రతుకుచును సేవసేయంగ । వలె నటంచు
తన నలక్ష్యంబుగాఁ జూడఁ । గనెడుచోట
తనదు పలుకెప్పుడును సాగ । దనెడుచోట
తనను పైకెప్డు రాకుండఁ । దన్నుచోట
నెవ్వరుండురు గౌరవ । మెన్నువార
లన్నియునుగూడ నెఱిఁగిన । దైనవాణి
యేలకో యాత్మలాభం బొ । కింత యెంచ
దల్ల లక్ష్మియె తన చెంత । సత్తియున్న
నెంత లెంతలు జగదుపకృతులు దాను
నశ్రమంబుగ సాగింప । ననువుపడును ?
ఒకరిసాయంబు భారతి । యొల్ల దెప్పుడు
అనుపమంబైన స్వాతంత్ర్య । మయినయపుడు
గానివేళల గూడను; । కలిమిలేము
లెంచ దొకపరియైన నొక్కించుకయిన
వాణికొక గర్వమాయెను । వదలదద్ది;

కలిమి యెంతగ లక్ష్మికి। బలిసియున్న
గడువదామెకు దా సాయ। పడక యున్న
సాయమననేల పేరైన। సంఘటిలునె ?
తనవలనఁగాక లక్ష్మి కం। తవఱ కేల
లోకమున కేది పేరు తా। లేకయున్న
నక్షరత్వంబె సిద్ధింప। దదియి దేల ?
తాను లేకున్న నెప్పటి। జ్ఞాన మపుడె
మాయమైపోయి జగమున। మరలమరల
పాడినదె పాడుచుండగ। వలసివచ్చు;
లోకమున వృద్ధి యన్నదే। లేకపోవు
లోక తంత్రంబు నడుపు ను। ల్లోకశక్తి
తన యధీనంబు నందెగాఁ। దనరుచుండు;
తన సుధీశక్తి బలమునఁ। బనివినట్టి
తంత్రముల నిర్వహింప సా। ధనముగాని
శ్రీ స్వతంత్రముగా నెద్ది। చేయగలదు ?
అనుచు తనశక్తి మదినెన్ను। కొనుచునుండు
నాత్మ విశ్వాస మలవాణి। కతి దృఢంబు
దరికిఁ జేరినవారల। కరుణఁ జూచు
వారిఁ దన యండ వారిగా। వరలఁ జేయు
సాయపడుచుండు స్వాతంత్ర్య। శక్తికొఱకుఁ
బాటుపడు వారికెల్లను। బట్టొసంగి
బ్రహ్మపట్టంచు తుదనిచ్చు। భక్తతతికి
నాత్మ సామ్రాజ్య మభిషేక। మలవరించు

—శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావు

# అక్షరగీతము

ఎంచఁగారాని శబ్ద ప్రపంచమందు
వేఱువేఱు రూపంబుల వెలయు నీదు
విమల పదముల నాత్మ భావించుచుందు
మనిశమును మాకుఁ దోడ్పడు మక్షరంబ !

మహితమై యొప్పు రుద్రాక్షమాలకన్నఁ
బేరుఁ గాంచిన ముత్యాల పేరుకన్నఁ
గోపు చూపెడు రతనాల కోవకన్న
నెందు నక్షరమాలికయే ఘనంబు.

దైవదత్తంబులైన వేదంబులకును
ధర్మ విహితంబులైన శాస్త్రంబులకును
న్యాయ రూపంబులౌ పురాణంబులకును
మూలమగునది యక్షరమాలగాదె ?

అఖిలమైన జగద్వ్యవహారమునకు
సకలమైన ప్రపంచ విజ్ఞానమునకు
వివిధమైన మనోభావ విసరమునకు
నిరత మాధారమైన దక్షరమకాదె ?

ఒక్కటై యొక్కరూపు నొండొంటిఁ గలసి
వేఱుపోలిక నందుచు వివిధ గతుల
వలన వివిధాకృతులఁ దాల్చి వఱలుచుండు
నట్టి యక్షర తత్త్వంబు నరయవశమె ?

ధరణిలో నామరూప భేదంబులైన
సకల జీవభావంబులు సకలలోక
గతులు, సకలేప్సితార్థ సంగతులుఁ దుదకు
నక్షరమునందె సంక్రాంతమగునుగాదె ?

నిత్యమై, నిర్మలంబయి నిశ్చలమయి
నిఖిలమున కాదిమై వర్ణనీయమైన
ప్రణవ మోంకారరూప శబ్దంబుగూడ
మఱిమఱింజూడ నక్షరమయము కాదె ?

ప్రకృతి నన్యోన్యవస్తు సంపర్క కలన
నాకృతి గుణంబులకు భేదమైనయట్లు
లీల నన్యోన్యవర్ణ సమ్మేళనమున
నర్థఫల సిద్ధులకు భేదమగుచునుండు.

ప్రకృతి రూపంబుఁ గని పరబ్రహ్మమూర్తి
యఖిల భావంబులకును దావైనయట్లు
గ్రంథరూపంబుఁ గాంచి యక్షరచయంబు
నఖిల భావంబులకును దావగుచునుండు.

ఆకసమునుండి పుట్టినయట్టి శబ్ద
మాకసమువోలె నీరూపమగుచునుండు
నక్షరంబునఁ బుట్టిన యట్టిశబ్ద
మక్షరాకృతితో నిత్యమలరుచుండు.

ధారుణి, నదీప్రవాహాప్తి సారవంత
మర్థవంతము, ఫలవంతమైన యట్లు

భావ మక్షర సంస్ఫూర్తివలన సార
వంత, మర్థవంతము, ఫలవంతమగును.

వికలిత నదీతరంగ మాలికలలోనఁ
బ్రకటితాక్షర రూపమాలికలలోన
శబ్దములె పుట్టునైన నక్షర భవంబు
లైన శబ్దంబులే సుమీ సార్థకములు.

వివిధ మతములవారిచే వివిధ రూప
భావముల బ్రహ్మ మర్చింపఁ బడినయట్లు
వివిధ భాషలవారిచే వివిధ రూప
భావముల నక్షరము వాడఁ బడుచునుండు.

ఆత్మ నిర్వృతి కో, పరమాత్మ దేవు
నరయుటకొ, పరమాత్మ తా నగుట కొఱకొ
సంతరింపఁగఁదగిన విజ్ఞానమునకు
సాధనంబైన దల్ల యక్షరమ కాదె?

ఒకనిఁ బ్రేమించి తగురీతి నోముటకును
నొకనిఁ గోపించి తగురీతి నొందుటకును
వలఁతియైయున్న నరపాలవరుని చేతి
కలమునకుఁ గల్గుశక్తి యక్షరమ కాదె?

జగతిఁ బుట్టింప, రక్షింప సమయఁ జేయఁ
గర్తయై, భర్తయై సమాహర్తయగుచుఁ
గర్తృకర్మక్రియాశూన్యగతి వెలుంగు
పరమ తేజంబు నక్షర వాచ్యమె కద!

ప్రకృతి జీవులలోన నీశ్వరుని వెనుక
నిలువఁ బడియున్న మానవకులము నెల్ల
నెలమిఁ బైమెట్టు నెక్కింపఁ గలుగుటకును
సాధనంబైన దక్షర జ్ఞానమెకద ?

సృష్టికర్తకు నీ జగత్సృష్టి వేళఁ
దత్త మొచిత విజ్ఞానంబు దనరఁ జేయు
నే మహాశక్తి ? యట్టి వాణీమ తల్లి
యక్షరాకృతియేగదా యరసిచూడ !

నీలములు, రత్నములు, గుణ నియతిఁ జేసి
ప్రబలియును నలంకార మాత్రములె కాని
సార్థకమ్ములు, నుతపరమార్థకములు
నైన యక్షరవర్ణ తుల్యంబులగునె ?

అక్షరంబీ జగద్వ్యవహారమునకు
నెన్నియొ పదంబులను సృజియించుచుండ
నల పరబ్రహ్మ లోక యాత్రార్థమనుచుఁ
బ్రాణికోటి కొన్నియొసఁగు నేపాటి ఘనత.

విశ్వమెల్లను వార్తచే వెలయుచుండు
వార్త వెలయును పత్రికావ్యాప్తివలన
పత్రికాస్ఫూర్తి యక్షరావ్యాప్తిఁ గలుగుఁ
గాన నక్షరమె జగత్కల్పకంబు.

అక్షరము వాణి కాధారమగునో ? వాణి
యక్షరంబున కాధారమగునో ? యక్ష
రాకృతియె వాణియొ ? యెఱింగి యానతిండు
సదమ లాక్షరతత్త్వ విజ్ఞానులార.

— శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు

## అక్షర మహిమ

(గురుశిష్య సంవాదం)

స్వప్రకాశమై స్వచ్ఛతరంబై
వరలెడి దేమిటి ? గురువర్యా !
స్వప్రకాశమై స్వచ్ఛతరంబై
వరలెడి "దక్షర" మో శిష్యా !

కల్పవృక్షమై కామధేనువై
గ్రాలెడి దేమిటి ? గురువర్యా !
కల్పవృక్షమై కామధేనువై
గ్రాలెడి "దక్షర" మో శిష్యా !

అధర్మ శక్తిని అణచివైచునది
అరయగ నేమిటి ? గురువర్యా !
అధర్మ శక్తిని అణచివైచునది
అరయగ "నక్షర" మో శిష్యా !

పశుబలంబును జయించునది యీ
వసుధను ఏమిటి ? గురువర్యా !
పశుబలంబును జయించునది యీ
వసుధను "అక్షర" మో శిష్యా !

పరమాణ్వస్త్రము ద్రుంచివైచునది
అరయగ నేమిటి! గురువర్యా!
పరమాణ్వస్త్రము ద్రుంచి వైచునది
అరయగ "నక్షర" మో శిష్యా!

మానవ విజ్ఞానమునకు మూలం
బైనది ఏమిటి? గురువర్యా!
మానవ విజ్ఞానమునకు మూలం
బైనది "అక్షర" మో శిష్యా!

ప్రపంచాభ్యుదయ ఉద్యమంబునకు
ప్రాణంబేమిటి? గురువర్యా!
ప్రపంచాభ్యుదయ ఉద్యమంబునకు
ప్రాణం "బక్షర" మో శిష్యా!

అన్ని సంపదల కన్నను శాశ్వత
మైనది ఏమిటి? గురువర్యా!
అన్ని సంపదల కన్నను శాశ్వత
మైనది "అక్షర" మో శిష్యా!

(గురుశిష్యు లిద్దరూ కలసి)

అక్షరమైనది అవనీ స్థలిలో
అక్షరమే! ఓ ప్రజలార!
అక్షరాస్యతను వ్యాప్తి జేయగా
అందరు నడుములు కట్టండోయ్.

— శ్రీ రేఘుడిచర్ల

# ౨. పుస్తకములు

[౧]

గీ. మదికుదురుఁ జేసి చల్లనిమాటచెప్పి
కలఁకనెడలించి ధైర్యంబు కలుగఁ జేసి
తల్లిదండ్రులఁబోలి పెద్దలనుబోలి
సదుపదేశంబు చేయుఁ బుస్తకమె నీకు.

గీ. మించువిజ్ఞానజలధిఁ దేలించునావ
మంచిచెడ్డలగతు లేర్పరించుత్రోవ
మానసికరోగముల నెల్ల మాన్పుమందు
పొగడఁ దగు విందు నీకెందుఁ బుస్తకంబె.

— శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు

[౨]

కలఁత లడఁగించు, కష్టముల్ తొలఁగఁద్రోయు,
పాపములఁబాపు బన్నముల్ పాఱఁద్రోలు,
మాంద్యమునుమాన్చు, దుఃఖముల్ మఱవఁజేయు;
కావ్యములు మానవుల పాలి కల్పలతలు.

కావ్యములు కావ్యమాత్రముల్ కావుతలఁప
అవి పురాతన ప్రస్తుత భవితృకాల
మానవుల జీవితంబుల మానసముల
భావముల నాశయంబుల వ్యక్తపఱచు.

తరములనుబట్టి విబుధులు దాచియున్న
జ్ఞానభండాగములు గ్రంథసంపుటములు
ధగణివెలసిన యందాక తఱుగఁబోని
వారసత్వపు హక్కులై వఱలుమనకు.

సృష్టిమొదలుగ మనుజు లార్జించినట్టి
నిస్తులంబగు మాన్యముల్ పుస్తకములు;
సతము సద్గ్రంథపఠనంబు కతనఁగాదె
పృథివి నాగరికతజెంది వృద్ధిఁగాంచు.

అమిత ధన ధాన్య భాగ్య భోగములకన్న
అమలవాఙ్మయ రామణీయకము ఘనము;
శేముషీవంతుల పవిత్ర జీవిత ప్ర
శస్త రత్నపుంజంబులు పుస్తకములు.

పుస్తకంబులు గలిగిన పూరిగుడిసె
యందు నిఱుపేదకాపురునై యుండుఁగాని,
పుస్తకంబులులేనట్టి భూరి సౌధ
మందు చక్రవర్తిగనుండ నభిలషింప.

నిలువుటద్దాలు సోఫాలు చలువరాతి
రౌండుమేజాలు కుర్చీలు నుండుఁగాక,
మంచిగ్రంథముల్ లేని యామందిరంబు
మందిరం బది గా దొక్క బంది గాని.

గ్రంథములు పెక్కు తనచెంతఁ గలిగియుండి
అనయమును వాని చదువని యట్టివాఁడు,

దివ్వెకరమున ధరియించి తిరుగు గ్రుడ్డి
వాని విధమున పరిహాస పాత్రుఁడగును.

మంచిగ్రంథము జదువఁ గాంక్షించువాఁడు
కోరఁడాప్తుల హితులను కూర్మిసఖుల;
దినదినంబును హితము బోధించుచుండు
పుస్తకంబులె తన కూర్మినేస్తగాండ్రు.

పరిజనంబులు మిత్రులు బాంధవులును
మనలవిడుతురు లేమి పైకొనినవేళ;
అండఁబాయక యెప్పుడు వెన్నంటితిరుగు
పొచ్చెములులేని నేస్తముల్ పుస్తకములు.

మేటికావ్యము జనులకు మేలుగూర్చు
అధమ కావ్యము తద్దయు హానిసేయు;
ఏదిమంచిదో, చెడ్డదియేదో యరసి
పుస్తకంబులు జదువంగఁ బూనవలయు.

— శ్రీ నాళము

[3]

మ. శ్రమచే డస్సిన కాలమందు మన ప
జ్జం జేరి భాషాప్రసం
గమునన్ వీనులవిందు గొల్పి యతి యో
గ్యంబైన భావప్రపం

చమునన్ ద్రిప్పి విశేషముల్ గజపి మా
 న్యత్వంబు నీ జాలు ను
త్తమ సంచారములో విమానములు గ్రం
 ధ వ్రాతముల్ గావొకో.

చ. అమల మనీషులై జగము
 నంతయు వీడి హిమాచల ప్రదే
శముల మహీరుహంబుల ప్ర
 శస్తపునీడల గూరుచుండి యు
త్తమమగు తత్వముల్ గను ము
 దంబున నిశ్చలులౌ మహర్షి తే
జములను భక్తిపూర్ణమగు
 స్వాంతముల్ గనుగొందు మచ్చటన్.

— శ్రీ కలచవీడు వేంకటరమణాచార్యులు

[౪]

పుస్తకాలు వట్టిమాటల పోగులుకావు
పక్షుల చిత్ర వర్ణములకాంతిని మించినవి
శ్రావ్య గీతికలకంటె యెక్కువ నిలకడ గలవి.
ఇవి చిరంజీవులు.
 వీటిని తెరచి చదివి నూాయడంతో
 విజ్ఞానం పెరుగుతుంది.
ఇందలి ప్రతిభావము
 దానికదే వేరు, ఆకు, ఫలము

సద్గ్రంథముల పుటలు త్రిప్పినట్లంతా
విజ్ఞానం అభివృద్ధి చెందుతుంది.
అనంతమైన విజ్ఞాన మహావనంలో
నిశ్చలంగా కూర్చొని, గాఢంగా ఆలోచిస్తూ
కాలంగడపిన విద్వాంసులు వెదజల్లిన బీజాలను
బైండు పుస్తకాలలోగాక బాహ్యప్రపంచంలో
పాఠకుడు తరచిచూచి నప్పుడిది
యింకా యెక్కువ జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది.

—జోసెప్ జోయల్ కీత్

[౨]

సరస మంజుల కథా సల్లాపములతోడ
నొకమాఱు చిత్తమ్ము నూఁపు దీవు
జీవిత చరితముల్ చేకోడుగానిచ్చి
మహనీయ నీతులన్ మనుతు వీవు
విజ్ఞానదాయక విమల బోధలచేతఁ
బ్రజ్ఞా విశేషముల్ పలుకు దీవు
నవరసమాధురీ నానార్థకల్పన
నొప్పుచు నానంద మొసఁగు దీవు

విశ్వ భూగోళమండలి విషయజాల
మంతయును గూడ నీయందు సమకియుండు
సర్వజనముల హితమ నీ సద్వ్రతమ్ము
పూత చారిత్రనికురుంబ! పుస్తకంబ!

సారాసార వివేకమున్ దెలుపు సచ్చారిత్ర సంయుక్తుడున్
పారావార గభీరచిత్తుడగుచున్ భాసిల్లు సన్మిత్రమున్
మీఱున్ ధర్మము నోర్వకప్పుడిక; నీ మిత్రత్వమెల్లప్పుడున్
కారుణ్యంబు నుదారవృత్తిగ నొసంగున్ గల్యాణమార్గమ్ములన్!!

చిత్తము శాంతతన్ విడిచి జీర్ణతనూభవరోగరాజి నా
యత్తముగాక మానవుడు హా! యని దుఃఖమునొందునప్పుడున్
పొత్తమ! నీవ యాతనికిఁ బోవని మిత్రమవై హితమ్ములౌ
సత్తిని దెల్పుచుండెదవు సాత్వికవృత్తిని తృప్తినిచ్చుచున్!!

భూతవర్తమానమ్ముల ఖ్యాతపురుష
బోధలన్నియు నీయందుఁ బొందఁగలము
మూఁడు కాలమ్ములందును ముదమునిచ్చు
సత్యశివసుందరమ్మగు సత్తు నీవ

పొత్తము మిత్రము బంధువు
పొత్తము నానార్థదాత బోధకుఁడున్ సం
పత్తియు బత్తియు జననియుఁ
బొత్తము మన వెలుఁగు, సంతు పూజ్యహితుండున్.

— శ్రీ జాస్తి వెంకటనరసయ్య

## పుస్తకావాహన

సీ. నిండార బాఱు నఖండ గోదావరి
దాగిన చాళుక్య నాగరికత
పాడైన పెనుకోటగోడల దీర్ఘ ని
ద్రలువోవు కాకతి ప్రాభవమ్ము

పల్లెపదాల జీవము నిల్పికొన్న ప
ల్నాటి వీరుల రక్తనాళ పటిమ
కడలేక యేడ్చు తుంగాభద్ర కెరటాల
మణగిన పూజ్య సామ్రాజ్య భరము
తే॥ గీ॥ హృదయములువిన పలుకక చదువుజెప్పు
పుస్తకతపస్విని తెలుంగుపూల పొదల
నిలిచి సేవాసుకమ్మల బిలిచి పిలిచి
స్థిరత పాడించుగాత జాతీయగీతి.

సీ. ఆచారమునకు దాస్యముజేయుచును వంట
యిల్లు దాటగలేని యిందుముఖుల,
ఉదయాస్తమయములు నొడలి చెమ్మటదీసి
క్షేత్రసేవలుచేయు సేద్యగాండ్ర,
బ్రతికినన్నాళ్లు తీరనికస్తి, రెక్కలు
విఱిచిజీవించెడు పేదజనుల,
అక్షరపంక్తులే యరయరాదనుచు, దు
ర్గతులద్రోసిన చెప్పరానివాండ్ర
తే॥ గీ॥ పూలతో నిండి కమ్మదనాలుచిమ్మ
పుస్తకనికుంజపుంజాళి పొంత బిలిచి
'నాజనము, నాదు దేశ' మనంగజాలు
ఇంత జ్ఞానభిక్షాదాన మిమ్ము తల్లి.

సీ. ఆంధ్రుల శిల్ప విన్యాసంబు చూపించు
కలిమి గోపురముల గలదటంచు,
ఆంధ్ర నాగరిక కళ్యాణ చిహ్నములైన
గానసాహిత్యముల్ గలవటంచు,

ఆంధ్ర భాగ్యమ్ము మోయగ గౌతమీకృష్ణ
దరులను నావలు దిరిగెనంచు,
ఆంధ్ర వీరులకు స్వర్గాతిథ్యమిచ్చి పా
టలుపాడిన యుగమ్ము గలదటంచు,
తే॥ గీ॥ చెప్పి యొప్పించు పుస్తక శ్రీకుమారి
యందగింపగగల యాలయములుగట్టు
డాంధ్ర దేశము నందెల్ల నాంధ్రపుత్రు
లాత్మ మానవ సంఘసేవానురక్తి.
—శ్రీ రాయప్రోలు సుబ్బారావు

## అందరికీ పుస్తకాలు

అందరకు పుస్తకాల్ – అంధులకు పుస్తకాల్
పిల్లలకు పెద్దలకు – ఎల్లరకు పుస్తకాల్ ॥అంద॥
౧. నారీమతల్లులకు – నోర్లేనివారలకు
కలవారలకు లేని – కటిక బీదలకును ॥అంద॥
౨. పనిలేక తిరిగేటి – పట్టణవాసులకు
పగలెల్ల పాటుబడు – పల్లె జనమునకెల్ల ॥అంద॥
౩. పేటలో గ్రంథాలు – కోటలో గ్రంథాలు
బోటులో గ్రంథాలు – బాటలో గ్రంథాలు ॥అంద॥
౪. స్వేచ్ఛగా తిరిగేటి – స్వాచ్ఛందవాదులకు
ఖైదులో మగ్గేటి – ఖైదీలతో సహా ॥అంద॥
౫. రోగములతో కుళ్లు – రోగిష్ఠులకెగాక
ఖైదులో మగ్గేటి – ఖైదీలతో సహా ॥అంద॥
౬. చదువ నేర్చినయట్టి – చదువజాలని యట్టి
పండిత పామర – మండలికి నంతాను ॥అంద॥
— శ్రీ పాటూరి నాగభూషణం

## సద్గ్రంథం

అన్నవస్త్రములవలెనే
అవసరమొక సద్గ్రంథం
ఉన్నతికై పాటుపడే
ఒక్కొక్కనికీ!

తిన్నతిండిమేన తిరిగి
తిరిగి శక్తి పూరించును
తిన్నని కబ్బము మదిలో
తెలివితేట లూరించును ॥అన్న॥

బడలిన యొడ లొక్కముద్ద
పడినంతనె పరవశించు
సడలిన మన సొక పొత్తము
నడుమ నొదిగి పవ్వళించు ॥అన్న॥

ఒంటబట్టినట్టి తిండి
ఒకపుడు వైదొలగిపోవు
ఒంటబట్టినట్టి చదువు
లొకనాడును తొలగిపోవు ॥అన్న॥

— శ్రీ శిష్టా

## నీ పొత్తం

నీపొత్తానికి నిజమగు విలువ
నిలువవలనరాదు—అది

నీవుగాక మఱి వేఱురు చదివిన
నీదిగాకపోదు—
రేపూమాపూ రవంత సేపు
దాపువారివై పు—ఈకర
దీపికజూపి అజ్ఞాన మనే
తిమిరమెల్ల బాపు
నాలుగుగోడల నడుమ వెలుతురై
నలుదెసలను జీకటులై తే
కాలవశమ్మున జీకటి వెలుగునె
కబళించునో యేమొ
నీలో నెలకొనియున్న జ్ఞానము
నిలువనీరె అయితే—అది
నేలమురికితో నేడో రేపో
నిండిపోవునేమొ !
మురికి సోకనీకున్నను ముందుకు
జరిగిపోని నీరై వేడికి
మఱిగిమఱిగి ఆవిరియై కడకది
మాయమగునో యేమొ !
ఇంటిపంచలో నుంచిన పాత్రము
లిరుగుపొరుగు పాల—దినమొక
గంట సేపు గ్రంథాలయమగుచో
పంటపండు ప్రజకు.

—శ్రీ శ్లో

# గ్రంథమహిమ!

కూటికి గుడ్డకు చీటీరోజులు
కోటీశ్వరులును కుమిలారు
జిహ్వాకు రుచియగు ఆహారంబును
చేసికొనగ ప్రాప్తంలేదు—

బియ్యము సరిపడనట్టి యొకాయన
కుయ్యోమొర్రో యనుకుంటూ
గోధుమగింజలకొరకై శ్రమతో
కొట్టుకొట్టునకు తిరిగాడు—

"ఎక్కడచూచిన పుచ్చుగింజలే!
ఏమికర్మమిది ? శ్రీరామా !
ఇన్నిపురుగులతొ తినుటెట్లంచును
ఎంతయు మదిలో జింతించె—

పురుగుల గింజలు కొనలేకను తా
తిరిగి యింటికే వచ్చాడు
గంజినో, గటకనో త్రాగుచు కాలము
గడుపుకొంటు యోచించాడు.

తన పొలమున ఒక కొంత భాగమున
తప్పక గోధుమ బండించ
తలచెను కానీ సేద్య విధానము
తెలియ దాతనికి- అంచేత—

పుస్తకాలయమునకు ఒక రోజున
పోయి గోధుమను పండించు
విధము దెల్పు ఏదైన పుస్తకము
వెదకి యివ్వుమని అర్థించె—

అంతట పుస్తక భాండాగారియు
ఆదరమున "తృణధాన్యములు"
అను గ్రంథంబును తెచ్చియివ్వగా
ఆతురతను చూచెను తెరచి,—

గోధుమ శీర్షిక కనబడినంతనె
కోరిక పండినదన్నటుల
ఉత్సాహముతో తనయింటికి యా
యుత్తమ గ్రంథము గొనిపోయె—

చదివి శ్రద్ధతో గోధుమపైరును
సాగుచేయు విధమెరిగి
స్వయముగ తానే నేలను దున్నియు
చక్కగ విత్తులు వెదబెట్టె—

దినదినమొక కళతోడ వృద్ధియై
కనులకు బంగారంబౌచు
కనబడుచును సంపూర్ణ భారమున
కళకళలాడిన దా పైరు—

పండిన పంటను గోతంబులలో
పట్టించాతడు తనయింటి

ప్రాచీ గడువగ మిగిలినపంటను
పుణ్య కార్యముల కిచ్చాడు—
ఊరివారి కిది ఆశ్చర్యంబై
చేరుకొనిరి చావడియొద్ద
"తృణధాన్యము" లను పుస్తకమహిమను
తీరుతీరులుగ పొగిడారు—

"చదువు నేర్చినచో సంసారములో
జనులకు మేల్లెన్నో కలవు
చదువుకొనని ప్రజ కరయగ సౌఖ్యము
చాలతక్కువ" నుకొన్నారు—

"గ్రంథాలయములు ముక్తిప్రదములు
గ్రంథాలయములు సుఖకరముల్
గ్రంథాలయములు భూతలస్వర్గాల్
జ్ఞానదాయకము" లన్నారు—

— శ్రీ రేమిడిచర్ల

## పత్రికలు

సీ. నరులలోపములెల్ల నరసి దిద్దుకొనంగ
బాగైన రత్నదర్పణములనఁ
వివిధధర్మాధర్మ విషయముల్ దెలియంగఁ
గమనీయ ధర్మశాస్త్రములనంగ
లోకవృత్తాంతముల్ సాకల్యముగఁదెల్ప
సరిమీరు కామసంచారులనఁగ

నీతిమార్గములెల్ల నెమ్మిమై బోధింప
నకలంకులైన శిక్షితులనంగ

తే. నెగడి యెల్లరచేత మన్నింపఁ బడుచు
నితర పత్రికలట్టు లున్నతి నహించి
తెలుగు పత్రికలెల్ల వర్ధిల్లు టెప్పుడో?
యనుచు గాంక్షించు నాంధ్రదేశాభిమాని.

— శ్రీ మంగిపూడి వేంకటశర్మ

## వార్తాపత్రిక

[౧]

ప్రజల మనస్సును ప్రతిబింబించు దర్పణం;
ప్రజల మనోగతమైన అభిప్రాయాలకు వ్యాఖ్యాత;
ప్రజల మనస్సులలో యుక్తాయుక్త పరిజ్ఞానాన్ని
రేకెత్తించే మహాసాధనం.

[౨]

మానవాభ్యుదయానికి సంబంధించిన
సమస్త విషయాలను ప్రచురిస్తుంది;
సదుద్యమాలన్నిటికి మిత్రునివలె సాయం చేస్తుంది;
సత్కార్యాలన్నిటిని ప్రోత్సహిస్తుంది.

[3]

తెలివికి నిలయం;
అజ్ఞానాన్ని, దురభిప్రాయాలను
పారద్రోలే (దివ్య) శక్తి;

చీకటి స్థలాలన్నింటికీ
వెలుగునిచ్చే (మహా) జ్యోతి.

[4]

ప్రజల మేలుకు పాటుపడుతూ
వారి గౌరవాన్ని కాపాడుతుంది;
ప్రజలలో ఐకమత్యాన్ని కూరుస్తుంది?
వారిహక్కులకు భంగం కలుగకుండా
సంరక్షిస్తుంది.

[5]

దుష్టులను వెంటాడి పీడిస్తుంది;
రహస్యంగా జరిగే పాపకార్యాలను
లోకానికి చాటుతుంది;
ప్రత్యేకమైన ఆధిక్యతలకు, లంచగొండితనానికి
బద్ధశత్రువుగా పనిచేస్తుంది.

[6]

దీనులకు, బాధితులకు అండగా నిలబడుతుంది;
మిత్రులు లేనివారికి మిత్రుడుగా పని చేస్తుంది;
వ్యక్తులు, సంఘం చేసే తప్పులను
సరిదిద్దుతుంది.

[7]

జరిగిన పనులను కాలక్రమానుసారంగా
రికార్డు చేస్తుంది.

పుక్కిటి పురాణాలనుండి, పక్షపాతంతో
కూడిన వ్యక్తుల అభిప్రాయాలనుండి
యథార్థ వృత్తాంతాలను బయటికి తీస్తుంది;
మనుష్యులను స్వతంత్రులుగా చేసే సత్యానికి
ప్రతినిధిగా పనిచేస్తుంది.

[౮]

నూతన విషయాలను నివేదిస్తుంది;
పురాతనమై, సత్యమైన సంగతులను
గుర్తు చేస్తుంది;
భవిష్యత్ సంఘటనలను సూచిస్తుంది.

[౯]

పౌర స్వాతంత్ర్యాన్ని పరిరక్షిస్తుంది;
దేశభక్తిని, స్వామిభక్తిని పెంపొందిస్తుంది;
ప్రజా ప్రభుత్వానికి స్థిరమైన ప్రాపుగా వుంటుంది.

[౧౦]

కుటుంబజీవనం సుఖప్రదంగా
జరిగేటట్లు చేస్తుంది;
సమాజదృష్టిని పెంపొందిస్తుంది;
సామాన్యప్రజల కళలు, సాహిత్యం
విజ్ఞానాల కాలవాలంగా వుంటుంది.

— 'గ్రంథాలయ సర్వస్వము' నుండి

## ౩. గ్రంథాలయములు

### జ్ఞానము

వాయువెట్టుల సర్వ ప్రపంచమందు
వ్యాప్తమైయుండునో, యెల్లవారలకును
అటులె జ్ఞానంబు వ్యాప్తమై యుండెనేని
కొదువయేముండు? మానవకోటికింక !!

జీవనాధారభూతమై సృష్టిలోన
ఉదకమెట్టుల సేవ్యమైయుండు నటులె
జ్ఞానమెప్పుడును సేవ్యమై మానవులకు
గూర్చు హాయిని శాంతిని గూర్మితోడ.

సూర్యచంద్రుల తేజముల్ సోక జగము
సర్వసౌఖ్యములందదె? సంతతంబు
జ్ఞానకిరణపు సోగము మానవులకు
నటులె సమకూర్చు సర్వసౌఖ్యములుగూడ.

— శ్రీ ఆరవెల్లి సత్యనారాయణాచార్యులు

జ్ఞానము అబ్బాలోయ్
ప్రజలకు
జ్ఞానము అబ్బాలోయ్॥

ప్రపంచమందున । వాయువెల్లరకు
కొలకొల్లగ ల । భ్యంబగునట్టుల ॥జ్ఞానము॥

అందరకును సుల । భంబుగ స్వచ్ఛం
బైన జలము చే । జిక్కినట్టుల ॥జ్ఞానము॥
శశి సూర్యుల తే । జంబెల్లరకును
అప్రయత్నముగ । అధీనమగు గతి ॥జ్ఞానము॥

— శ్రీ రేమిడిచర్ల

## పుస్తకాలయములు

యుగయుగాంతరముల ప్రజాభ్యుదయదీక్ష,
దేశసేవా తపస్సు గీతికలు పాడి
చనిన మహనీయుల ప్రబోధ సరళ రాగ
మాలపించు వీణెలు పుస్తకాలయములు.

కరుడుగట్టు సముద్రాల కడలయందు,
బొద్దుగ్రుంకుట లెరుగని భూములందు.
బుత్రు డెందెందు మేల్కొని భుజమునాచె
బుత్రి యెందెందు ముసుగెత్తి ముందునడచె.

అందునందెల్లబూచి పొల్పారుచున్న
జ్ఞానసుమములు దండలుగట్టి తెచ్చి
గ్రంథ ముఖవీధికలకు సింగారమిడెడి
అభ్యుదయ బాంధవంబు గ్రంథాలయంబు.

— శ్రీ రాయప్రోలు

# భూకల్పకము

సీ. తొలుతఁ 'అట్లాంటిస్సు' బలితంపు ఖండాన
బలుతోళ్ల వ్రాఁతలన్ పరగె—ఎద్ది?
పిదపఁ 'ఈజిప్టు' లో బెరడులోఁ గూర్చిన
'పాపిరా' పొత్తాలఁ వఱలెఁ ఎద్ది?
పిమ్మటఁ *'తెన్నాట'ఁ ఇమ్ముగాఁ కోసిన
తాటాకు పొత్తాలఁ తనరె—ఎద్ది?
ఆవలఁ 'చాల్డియా—అస్సీరియా' లలో
ఇటికల వ్రాలతోఁ ఎసఁగె ఎద్ది?
ఆవెన్కఁ 'చీనా'ను శివిగాఁ చేసిన
కాగితముల వ్రాలఁ గ్రాలె ఎద్ది?

గీ. అంతఁ పలునాళ్లఁ కడువడిన్ అలరె—ఎద్ది?
ఇప్పు డెల్లనాడులలోనఁ ఒప్పుఁ ఎద్ది?
అయ్యవారల కయ్యవారగును—ఎద్ది?
అద్ది భూకల్పంబు—గ్రంథాలయంబు!

గీ. పొత్తములె అయ్యవారులై, క్రొత్తక్రొత్త
కమ్మలే బడి పెద్దలై గ్రాలఁ, ఎల్ల
చదువులెల్లరున్ చదువుకోఁ జాలెడు కడు
సొంపులగు మేటిబడులు—పొత్తంపు గుడులు!

—శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి

* దక్షిణదేశమున

# ధర్మగ్రంథాలయములు

[౧]

శ్రీకరములు సద్గుణ బో
ధాకరములు మాతృవాఙ్మయాలంకృత శో
భాకర విద్యాగృహములు
ప్రాకట నిజదేశ ధర్మగ్రంథాలయముల్.

సీ. విద్యార్థులకు విశ్వవిద్యాలయంబౌచు
విద్వాంసులకు మేటి విడిదియగుచు,
గవితల్లజుల కావ్యకన్యకు గృహమౌచు
గృతినాయకుల కీర్తి గేహమౌచు,
బరిశోధకుల దివ్య పరికరాలయమౌచు
జారిత్రకుల ముఖ్య సదనమగుచు,
దేశసేవకసంఘ దివ్యాశ్రమంబౌచు
దేశజనుల భాగ్యకోశమగుచు,

తే. గీ. చిత్రకారుల వైభవశ్రీలెసంగు
చిత్రవస్తు ప్రదర్శన సీమ యగుచు,
మాతృదేశాభివృద్ధికి మార్గమగుచు
నలరుచుండును ధర్మ గ్రంథాలయంబు.

సీ. అజ్ఞాన తిమిరాపహరణ కారణ వివే
కార్క బింబంబు గ్రంథాలయంబు
మాతృభాషా దివ్యమహిమోన్నత యశో వి
శాలసౌధంబు గ్రంథాలయంబు

విస్తృత దేశీయవిద్యాలతాంకూర
మూలబీజంబు గ్రంథాలయంబు
జాతీయ సంఘవిజ్ఞాన కల్పాభ్యుద
యాలవాలంబు గ్రంథాలయంబు

తే. గీ. భారతీ భూషణ వికాస భాసురంబు
పండిత మహాజన సభా విభాసితంబు
వివిధసత్కళా వైభవ విలసితంబు
అఖిలజనపూజితంబు గ్రంథాలయంబు.

—శ్రీ కాట్రావులపల్లి రామమూర్తి

[౨]

సీ. అఖిల దేశముల ప్రఖ్యాతిగన్న మహాత్మ
మంజులాలాప సంపద యనంగ,
సర్వదేశముల ప్రశస్తి జాటిన ధీర
శేముషీ విభవ విశేషమనగ,
కర్ణేంద్రియ ప్రీతి గావించు కవిరాజ
సత్కావ్య కల్పనా సారమనగ,
షట్ఛాస్త్ర నిర్మాణ చణమైన పండిత
ప్రజ్ఞాతిశయ విజృంభణ మనంగ,

గీ. రాశిజేసిన జ్ఞాన సర్వస్వమనగ,
ధర్మపుస్తక నిలయంబు తనరుచుండు,
నుచితగతి దాని నెత డుపయోగపరచు
నతడె వెలలేక విజ్ఞాన మందువాడు.

ఉ. బాలుర విద్యలందనుపు ప్రౌఢులకున్ ముదమున్
ఘటించు; సు
శ్రీల జెలంగువారలకు చెల్వొనగూర్చును కష్టజాలముల్
జాలగ గూరియున్నతఱి శాంతినొసంగి సతంబుమంచు, గ్రం
థాలయముల్ జగంబున ననంత శుభోదయముల్
దలంపగన్.

సీ. అరువదినాల్గు విద్యలు నొక్కచో నేర్వ
దగు నిలయంబు గ్రంథాలయంబు,
దరిలేని దుఃఖసాగరముల నీదంగ
దరణితుల్యంబు గ్రంథాలయంబు,
బుద్ధిమదగ్రణుల్ పూర్వులొసంగిన
ధన నిధానంబు గ్రంథాలయంబు,
అజ్ఞానతిమిర సంహారంబుగావించు
నర్కతేజంబు గ్రంథాలయంబు,

గీ. యశమె కాయంబుగాగల ప్రాజ్ఞ సుకవి
బృందముల రూపముల బ్రదర్శించి జనుల
గరము సమ్మోదితాత్ములుగా నొనర్చు
నట్టి సన్మందిరంబు గ్రంథాలయంబు.

ఉ. దీని నిజంబెఱింగి మన దేశమునంగల పట్టణంబులన్
జానపదంబులన్ సులభసాధ్యములై తగ గ్రంథమందిరాల్
మానుగనిల్పి సర్వజనమండలి విద్యల నేర్వకున్న స
న్మానమొనర్తురే మనల నాగరికాగ్రణులంచు నన్యులున్.

—శ్రీ ముట్నూరి వేంకటసుబ్బారాయుడు

# విద్య : గ్రంథాలయములు

భుక్తి ముక్తులొసంగి పోషించు విద్య
శక్తి సంపదలెల్ల సమకూర్చు విద్య
కంటికిఁ గన్నయి కాపాడు విద్య
యొంటికిఁ గవచమై యోమెడు విద్య
జీవజీవంబయి చెలఁగెడు విద్య
జీవుని దేవుని జేసెడు విద్య
మరణింప నరుని వెంబడి చను విద్య
మఱఁ బుట్టు నతనితోఁ బుట్టును విద్య
విద్యకు సాటి యీ విశ్వానఁ గలదె?
విద్య లేనాతఁడు వృథయౌను గాదె !!

మిత్రమై వీడక మెలఁగును విద్య
శత్రుల హృదయ శస్త్రంబగు విద్య
తప్పక ప్రోచు విత్తంబగు విద్య
అప్పిచ్చు నాతని కందని ధనము
దానంబు జేసినఁ దఱుగని ధనము
ఆ నరపతి కట్న మడుగని ధనము
అన్నదమ్ములు భాగమనరాని ధనము
కన్నంపుదొంగ పాల్కానట్టిధనము
విద్యయౌఁ; గళలు విద్యలు; కావ్యతతులు
విద్యలు; విద్యలౌ వివిధ గ్రంథములు;
అది కారణముగ గ్రంథాలయంబరయ
విధిగ శరణ్యంబు విద్యలు చేర్ప.

ముగురుమూర్తుల కది ముఖ్యాలయంబు
ముగురమ్మ లెప్పుడు కాపురముండు పురము
అది సర్వవిద్యలకగు నిధానంబు
అది షణ్మతంబుల కాలవాలంబు
అది క్రీస్తుపదము; మహమ్మదు గృహము
అది మన త్యాగరాజయ్య తంబురము
అది రవి కవిగీతి కాలాపనంబు
అది రామకృష్ణుని యారామవనము
అది వివేకానందు నద్భుతవాణి
అది రమణ మహర్షి యాశ్రమవాటి
అది బిసెంటమ్మ తత్వామృత పేటి
అదియె రాధాకృష్ణు నన్వయమతము
అది గాంధిగారి సత్యాహింస వ్రతము
అదె జవహరునీతి; అదె బోసు ఖ్యాతి
అది పొట్టివారి నిరశన ప్రబోధ
మరియు యా విశ్వేశ్వరయ్య పెద్దతల
అది శరశ్చంద్రు దివ్యంపు "సైన్సు" కళ
అది యగు చరకుని యౌషధాలయము
అది పురందరుల శ్రీహరిభక్తి సురభి
అది జ్ఞానదేవు దివ్యజ్ఞాన కలశ
మది రవివర్మని హస్తంపు కుంచె
ఆదియగు నక్క మహాదేవి వచన
మది యన్నమయ్య మహాద్భుత రచన

అది కబీరుని హృదయాంతర భక్తి
అది దాస కనకుని హరిభక్తి సార
మది శుక్రనాడి; యయ్యది రమలశ్రీ
మదియ యాంగ్లేయ దివ్యగ్రంథమాల
సాధ, నాంధ్ర, ప్రభ సరస పత్రికల
వేదికయది; యది విశ్వసాహితియ—
బలుపారు గీర్వాణి, ప్రాకృతవాణి,
తెలుగు, కర్ణాట, హిందీ, యింగిలీసు
కలభాషణులు, నింకగల బాసచెలువ
లట్టాడఁగలతావు; నందలాలెక్క—
యుట్టూత లారాణులూఁగు నుయ్యాల
లవి కవిసిరులు; విద్యార్థులపంట—
లవి పండితులనోము; లవి శోధకులకు
చవివటం; కృతిపతి సద్యశోగృహము
లవి వృత్తి విద్యల కాకరస్థలము
లవి కళాకారుల యశోభక్ష్యమ్ము!
లవి దేశభక్తుల యైశ్వర్యనిధులు
పనిలేనివారికిఁ బానశాలలవి
పనియున్నవారికిఁ బండ్లపుటికలు!

గ్రంథాలయంబులు గలుగనివారు
అంధులు; మూఁకలు; నరయబధిరులు!
ఏడ గ్రంథాలయాలే లేకయుండు
వీడుగాదది పాడుపీన్గులబీడు!!

ఆరువేలేండ్లనాఁ డవి భారతమున
వేరూని యున్నట్లు వివరించుఁ జరిత
అల దేవలములు గ్రంధాలయములఁట
తలఁప నర్చకులు తద్రక్షకులంట—
తాటాకులందు వ్రాతలు వ్రాసి, నాఁడు
నీటుగా గ్రంథాలు నిర్మించిరంట
ధనిక, దరిద్రభేదంబులు లేక
జనులకుఁ జదువంగ సమకూర్చిరంట
గ్రంధాలు నిటికి పల్కుల వ్రాసిరంట
చందమారంగఁ బాశ్చాత్యులానాఁడు
ఖండాంతరములందు గ్రంధాలయములు
దండిగనున్న; వద్దానితోఁబోల్చి
కనఁగా మనది, పాతికయుఁగాదు సుండి
మనసిచ్చి పెద్దగా మనుపఁ గదండి !!—
చదువులో మనలఁ, బాశ్చాత్యులఁబోల్ప,
నది హస్తిమశక వ్యత్యాసమైయుండె !—
దేశోన్నతిని లెక్క తేల్చుట ద్రవ్య
రాశితో, జనసంఖ్య రాశితోఁగాదు
అద్ది సంస్కృతిపైన నాధారపడును !—
వృద్ధియా సంస్కృతి విద్దియచేత !!
విద్య నేర్పుడు పిన్న పెద్దలంచనక
విద్య మగువ నేర్వ విధియాను విడక.

—శ్రీ కలుగోడు అశ్వత్థరావు

# పుస్తకాల ఇల్లు

(అబ్బాయి, అయ్యవార్ల సంభాషణ)

వచనగానము

అబ్బాయి :

ఏమండీ ! అయ్యవారూ!
ఎవరిదండీ ఆయిల్లు ?
అంతమంది వస్తారు–
అంతమంది పోతారు–
ఒక్కళ్లూ ఆ యింట్లో
వొండుకోరు–పండుకోరు
ఏమండీ అయ్యవారూ
ఎవరి దండి ఆయిల్లు?

అయ్యవారు :

అందరిదీ నబ్బాయీ!
అందరి దీన్నీ–

అబ్బాయి :

అయ్యవారూ ఆయింట్లో
బియ్యమే లేవేమండి ?
పొయ్యిలేదు, బానలేదు,
పుస్తకాల బీరువాలే !

అయ్యవారు :

పుస్తకాల యిల్లమ్మా !
పుస్తకాల యిల్లది–

అబ్బాయి :

అయ్యవారూ పుస్తకాల
కంత యిల్లెందు కండీ
అంత పెద్ద పుస్తకాలు
ఎవరు చదువుకుంటారండీ ?

అయ్యవారు :

అక్షరాలు వచ్చిన వా
ళ్లన్ని చదవొచ్చమ్మా !

అబ్బాయి :

బళ్ళోనే చదువుచెబితే
పుస్తకా లిల్లెందుకండీ ?

అయ్యవారు :

అదిగాదోయ్ అబ్బాయీ !
చదు వెంతుం దనుకున్నావ్
పాటలు పద్యాలేనా !
కథలూ కావ్యాలేనా !
లోకంలో పనులన్ని
రకరకాల మాటల్లో
ఎంచక్కా రాశారో
ఎవరైనా చెప్పగలరా ?
చదువు సముద్రం లాగా
చాలా పెద్దది బాబూ
అంత పెద్ద చదువంతా
ఏ బళ్లో చెబుతారూ ?

అబ్బాయి :

అక్షరాలు నాకొస్తే
అన్నీ చదవొచ్చండీ?
అయితేనూ, చిన్నవాళ్లు
అటుపోతే కొట్టరండీ?

అయ్యవారు :

కొట్టరురా అబ్బాయీ!
పుస్తకాల యింట్లోకే,
నువ్వుగూడా పోవచ్చు.
పుస్తకాలు చిరక్కుండా
కాయితాలు నలక్కుండా
పుచ్చుకొని చదువుకొని
ఇచ్చివేసి రావాలి.

—శ్రీ శిష్టా

## గ్రంథాలయ ప్రాశస్త్యము

[౧]

అమృతభాండము నిజము గ్రంధాలయంబు
అమృత బిందువులేయగు నఖిల గ్రంథ
ములు తదాస్వాదనంబున గలుగు నరున
కఖిల మంగళములు సంశయంబు లేదు.

—శ్రీ జంధ్యాల వెంకటేశ్వర్లు

[౨]

తే. గీ. మట్టివిత్తున డాగిన - మ్రానుపగిది
వెన్ను నోటనుగన్పట్టు - విశ్వమట్లు
సభ్యతా సంస్కృతులు సర్వ - శక్తులకును
ఆశ్రయమ్ములు తెలుఁగు గ్రం - థాలయములు.

తే గీ. సర్వవిద్యలు కళలును - శాస్త్రములును
అడిగినది తడవుగ చేతి - కందఁజేసి
జ్ఞానతృష్ణను బాపు జి - జ్ఞాసువులకు
అమృతకడలులు తెనుగు గ్రం - థాలయములు.

— శ్రీ చొల్లేటి నృసింహశర్మ

[3]

ఆ. వె. ఆలయములలోన నవని గ్రంథాలయం
బురు ఫలప్రదంబు; పరమతస్థు
లెందరైన దీని పొందఁగా వీలగు,
నంటుదోసమిచట నరయరాదు.

తే. గీ. ఆకసమునుండి కటికి చీకటిని న
శింపగాజేయు పూర్ణశశివలె, నాల
యాల రాజిలు గ్రంథాలయాలు, పామ
రాళి యజ్ఞానమును బాఱఁద్రోలు కతన.

— శ్రీ యన్. జి. శాస్త్రి

[౪]

సీ. వేదముల్ బహుశాస్త్రవాదముల్ విమల
సమ్మోదముల్ కనఁజేయునొజ్జభంగి
తప్పులన్దిద్ది మేలొప్పులంజెప్పి బల్మెప్పులం
గూర్చు మాయప్పభంగి
ప్రేమమున్జూపి తనోన్నముచుఁ హితమార్గ
మెసగ జేసెడి జనయిత్రిభంగి
ముద్దులం జూపుచుం బెద్దలం జేయుచుం
పద్దులంజేర్చెడు పెద్దభంగి
గీ. ఘనమనోమోదమును గూర్చు కాంతభంగి
ఇష్టకామ్యంబు లొనగూర్చు నీశుభంగి
నేరమునుదిద్ది మన్నించు నేతభంగి
పుస్తకాలయమును సరిబోలునెద్ది?

— శ్రీ బలివాడ వెంకటసూర్యనారాయణరావు

[౫]

సీ. తులలేని జ్ఞానవస్తువును జూపింపంగ
దేజరిల్లెడు మహాదీపమెద్ది?
సకలరాష్ట్రపు సమాచారముల్ దెలియంగ
నలరెడు కరతలామలకమెద్ది?
సర్వదేశముల పూజ్యతగాంచు భారతీ
దేవికి రంగప్రదేశమెద్ది?
ఇది మంచి దిదిచెడ్డది యటంచు నాశ్రిత
జనులకు దెల్పు నాచార్యుడెద్ది?

గీ. అట్టి పుస్తక భాండాలయమ్ము వలన
గలుగులాభముల్ వచియింపగా దరంబె?
గాన దీ న్యభివృద్ధికి బూనవలయు
దప్ప కెప్పుడు నాంధ్ర సోదర్యులార!

— శ్రీ జంధ్యాల వెంకటశివకవులు

[౬]

సీ. కోవిదశ్రేణికి గొంగు బంగారెద్ది
ఛాత్రబృందమున కాచార్యుడెద్ది
అజ్ఞాన తిమిరంబు నణచు దీపంబెద్ది
శారదా దేవికి స్థానమెద్ది
బీదసాదల కెల్ల బెరటి కల్పకమెద్ది
యర్థిజనుల కేది యర్థపేటి
యైకమత్యంబున కాలవాలంబెద్ది
అఖిలవిద్యల కేది యాటపట్టు
అట్టి పుస్తక భాండగారమ్ము వలన
గలుగు మేలును గొనియాడగా దరంబె
సరసులార ధర్మము సేయు పురుషులార
దీనియభివృద్ధికిన్ మీరుపూనుకొనుడు.

— శ్రీ గరిగిపాటి బాలవెంకటకృష్ణమూర్తి

[౭]

సీ. ఆంధ్ర గీర్వాణ హూణాది భాషాంగనా
రత్నంబులకు విహార స్థలంబు
వివిధ దేశాగత నవపత్రికా పుత్రికా
మణులకు కేళికా గృహంబు

ప్రాచీన దేశ కాలాచార సువిచార
        తతికి నిర్మల మణి దర్పణంబు
ఆధునికాద్భుత బోధన చతుర
        బుధాగ్రేసరులకు సౌధాగ్ర సీమ
గీ. అప్రమత్త వినోద కవి ప్రభావ
భావనా మోఘ నవ్య ప్రపంచ సృష్టి
రంగ వైచిత్ర్య విజ్ఞాన సంగతులకు
ననుపమ శ్రీయుతంబు గ్రంధాలయమ్ము.

— శ్రీ సోమపల్లి సంపత్ కృష్ణమూర్తి

[౮]

శ్రీలక్ష్మి విలసితమై
భూలోకము స్వర్గతుల్యమును నొనరింపన్
జాలెడి యాలయ మొక గ్రం
ధాలయమే భువి వెలయు ప్రధానంబగుచున్.

సీ. అజ్ఞాన తిమిరమ్ము నణగించు రోచిస్సు
        విజ్ఞాన చంద్రికల్ వెలయు విధువు
చిత్త విస్ఫురణంబు సేసెడి బోధంబు
        మానసికానంద మధురమధువు
అలసత్వమును ద్రోల ననువైన ములుకోల
        కార్యశూరులఁ జేయు కర్మ భూమి
ఇహాపర సమ్మోదావహమైన సుపథమ్ము
        మనుజ సంతతికి సన్మార్గదర్శి

సరస సహకార సౌహార్ద్ర సత్యశీల
సాధుసంగత సద్గుణస్థైర్య సరళ
సత్పథానుగాములుగను సల్పఁగలుగు
నాలయమొక్క గ్రంధాలయమ్ము సుమ్ము.

— జయభేరి ఖండకావ్యమునుండి

[౯]

సీ. సకల జాతులవారి సమత సన్మానించు
నైకమత్యముగూర్చు నాదరించు
ఇతిహాసములవెల్లు మతిభాషలన్ జెప్పు
శాస్త్రాగమ వ్యూహ సరణిఁ దెల్పుఁ
గళలెల్ల నేర్పించుఁ గవివరేణ్యులఁ జూపు
సాధ్వీ చరిత్రముల్ చక్కఁజాటుఁ
బ్రకృతి యందంపుఁ జిత్రములఁ గన్నులఁగట్టు
సర్వ సందేహముల్ సరగ మాన్పు
వృత్తాంతములఁ దెచ్చు గృషి సల్పు టెఱిఁగించు
వాణిజ్య విధులెన్నొ కానఁజేయు
నఖిలరాజ్యాంశము లాద్యంతమును బిండి
యారబోసినయట్టు లాత్మల కిడు

గీ. నిదియు నదియని వచియింప నేల? గ్రంథ
సద్మముల మూలమున సమస్తంబుఁ గలుగు;
స్వీయ రాజ్య సంపాదనాపేక్షఁ దీర్చు
సాధనంబుల నెన్నియో బోధసేయు;

కుటిల సంసార సౌకానుకూల మర్మ
జాలమెఱిఁగించుఁ గాదె గ్రంథాలయములు?

సీ. విశ్వవిద్యార్థ సద్విజ్ఞాన మిడు పాఠ
శాలలుగావె గ్రంథాలయములు?
గతకాల నిజరాష్ట్ర కమనీయ చరితాంశ
తతి దెల్పుఁగాదె గ్రంథాలయములు?
సకలదేశాచార సద్ధర్మ బోధనా ద
ర్శములఁ గావె గ్రంథాలయములు?
భక్తిముక్తిద లసత్ప్రభలీను దేవా
లయంబులుగావె గ్రంథాలయములు?
పేదసాదులకెల్లఁ బెన్నిధానములు మం
దారముల్ గావె గ్రంథాలయములు?
అజ్ఞాన గాఢాంధ మవలఁ ద్రోసెడు చం
ద్రికా లతల్ గావె గ్రంథాలయములు ?
ఆత్మరోగములెల్ల నడఁచు నాయుర్వేద
ధామముల్ గావె గ్రంథాలయములు ?

గీ. శారదా దేవి విహరించు చారుగంధ
కలిత మలయానిలము లొల్కు, కనులకింపుఁ
గొలుపు నందనోద్యాన సీమలయి, జనుల
కమిత ముదమిడుఁగాదె గ్రంథాలయములు ?

— శ్రీ అల్లమరాజు నారాయణరావు

[౧౦]

సీ. మానవ జీవిత మాధుర్య మర్మంబు
తెరిగించు సద్గురువరుడ వీవు
సకల సభాస్థాన సంఘంబులందున
మిగుల ఖ్యాతిని గూర్చు మిత్రుడీవు
అజ్ఞాన మోహార్ణవంబున మున్గిన
నరు దేర్చు జ్ఞానంపు నావ వీవు
సరసమౌ కామిత సముదయంబులనెల్ల
దీర్చెడి వేలుపు ధేనువీవు
వారు వీరను భేదంబు జేరనీక
నీదు దరి జేరు జనులకు నిత్య సౌఖ్య
మతుల తేజంబు మోక్షంబు నమల కీర్తి
జేర్చు 'పుస్తకాలయమ' జేజేలు నీకు!

చం. కవులకు కీర్తికాయమవు
కమ్మని బాసకు నిల్వ నీడవున్
ప్రవిమల భక్తి రక్తులకు
పట్టిన కొమ్మవు మూర్తి గొన్న వా
ణివియును నిన్ను జేరు నరు
నెంతటి యల్పునినైన మేటివై
భువి వెలుగొంద జేసెదవు
'పొత్తపువాసమ' జ్ఞానదీపమా!

సీ. నీమధుక్షీరాన ప్రేమ పెంచుటగదా
దేశనాయకులౌచు వాసిగనుట

నీమృదుపల్కుల నామోదించుటనెగదా
పండితాగ్రేసర పదవిగనుట
నీదుచల్లనినీడ సేదదేరుటగదా
ఆనంద జీవనావధినిగనుట
నీదుబోధనలచే నిగ్గుదేరుటగదా
ముక్తి వీధులజేరు శక్తిగనుట
భారతీదేవి నీమృదుభద్రపీఠి
కొలువుదీర్చును వేదాలు గొలువ నిన్ను
దెలిసి నుతిజేయవశమె యోదేవదేవి
ప్రణతులివెగొను 'పుస్తకప్రతతినిలయ!'

సీ. రంగారు కథల నుప్పొంగురీతిగ వీర
వరుల బాల్యంబున నెరుకపరచి
దానదయాన్విత మానితోత్కృష్టంబు
లెల్ల కౌమారాన వెల్లడించి
శృంగార కావ్యాదులంగల్గు భావంబు
లలయౌవనంబున తెలియపరచి
మోక్షసాధనమౌ నమోఘచరిత్రల
వృద్ధాప్యమందు సమృద్ధిదెలిపి
బాల్య, యౌవన, కౌమార బహుళదుఃఖ
భరితమౌ జరయందున పరమసౌఖ్య
మిచ్చు జీవితసహచరి వీవె 'గ్రంథ
మందిరమ' నీకివే మాదువందనములు!

— శ్రీ గుంటుక బసవరాజు

[౧౧]

సీ. భాషాలతా సమున్మేష క్రమంబున
కాలవాలంబు గ్రంథాలయంబు
కవిజనవ్రాత కాంతూపరిస్ఫూర్తికిఁ
గాళీరవంబు గ్రంథాలయంబు
సాంఘికవిద్యార్థి చాతకశ్రేణికి
నీలమేఘంబు గ్రంథాలయంబు
జాతీయధర్మ ప్రభాతకాలమునకు
బాలాతపంబు గ్రంథాలయంబు.

గీ. సకలవేదాంత సిద్ధాంత సారబోధ
కనుపమాచార్యకంబు గ్రంథాలయంబు
ధాత్రి దేశాభివృద్ధి సంధానమునకు
లాలనీయాగమంబు గ్రంథాలయంబు.

సీ. వేదశాస్త్రపురాణ విద్యారహస్యంబు.
లాలింపఁజేయు గ్రంథాలయంబు
సర్వతంత్రాక్రాంత చర్చామృతరసంబు
గ్రోలింపఁజేయు గ్రంథాలయంబు
స్వాతంత్ర్యమున సర్వసర్వంసహా రాజ్య
మేలింపఁజేయు గ్రంథాలయంబు
కామాది విద్విషద్గ్రామ ప్రకోపంబుఁ
మాలింపఁజేయు గ్రంథాలయంబు
ధర్మనీతి వివేక మర్మంబు లనిశంబు
గీలింపఁజేయు గ్రంథాలయంబు

సంసార సంతాప సాగరంబుననుండి
తేలింపఁ జేయు గ్రంథాలయంబు
దేశాభిమాన విద్వేషప్రతాపంబు
ప్రాలింపఁజేయు గ్రంథాలయంబు
ఉగ్రాత్ములగు నాస్తికాగ్రగణ్యులనెల్ల
సోలింపఁజేయు గ్రంథాలయంబు
సరసగాన కవిత్వ సాహిత్యములఁ గడుఁ
గ్రాలింపఁజేయు గ్రంథాలయంబు
లౌకిక ప్రజ్ఞా వివేకప్రచారంబుఁ
బాలింపఁజేయు గ్రంథాలయంబు
రసనాగ్రమందు సరస్వతిందాండవం
బాడింపఁజేయు గ్రంథాలయంబు
అవ్యయంబగురీతి దివ్య తేజోరాశి
నార్జింపఁజేయు గ్రంథాలయంబు
సత్పాత్రులైన విద్వత్పుంగవులఁజేరి
ప్రార్థింపఁజేయు గ్రంథాలయంబు
స్థైర్యయుక్తంబైన ధైర్యసాహసలక్ష్మి
నాశింపఁజేయు గ్రంథాలయంబు
అత్యాశమైదూకు మృత్యుదేవతనైన
నడలింపఁజేయు గ్రంథాలయంబు
భక్తివైరాగ్యసంసక్తి సార్థక్యంబుఁ
బ్రాపింపఁజేయు గ్రంథాలయంబు

నానామతాంచిత జ్ఞానోదయస్ఫూర్తి
నర్ధింపఁజేయు గ్రంథాలయంబు
చిత్రసృష్టిక్రియాపాత్ర సాధనశక్తి
నందింపఁజేయు గ్రంథాలయంబు
మించుగార్యములు సాధించు విద్యుచ్ఛక్తి
నర్పింపఁజేయు గ్రంథాలయంబు
ఘన యశోయుతులైన కవిసార్వభౌముల
నర్పింపఁజేయు గ్రంథాలయంబు

కాలమెరిగింపఁజేయు గ్రంథాలయంబు
శీలము ఘటింపఁజేయు గ్రంథాలయంబు
ఆలయములకు నెగ్గు గ్రంథాలయంబు
పాలపైఁబొల్చునిగ్గు గ్రంథాలయంబు.

— శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రి

[౧౨]

సిరులెల్ల క్షరము, లక్షరమైన సిరిఁజూపు
నాప్తోపదేష్ట గ్రంథాలయమ్ము
జగము నశ్వర మనశ్వర జగమ్మును జూపు
నమరాలయంబు గ్రంథాలయమ్ము
తలఁపు చంచల మచంచలమైన తలఁపూన
నశ్రమాశ్రమము గ్రంథాలయమ్ము
నామరూపములు శూన్యములు వానియశూన్య
తా వ్యాప్తికిఱవు గ్రంథాలయమ్ము

సదసదస్తిత్వనాస్తిత్వ సత్యతాను
భూతి కిదితావు; యుగయుగమ్ములను జన్న
వారిమూర్తులు కీర్తులై, వారియూహ
లవియు గ్రంధావతారమై భవము కొనుట.

— శ్రీ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షితులు

[౧౩]

తే. గీ. నవనవాఖ్యానమణుల రత్నాకరంబు
గ్రంథసుమములచే నొప్పునందనంబు
వాంఛితార్థంబులిచ్చు కల్పద్రుమంబు
అఖిలసంపత్కరంబు గ్రంధాలయంబు.

తే. గీ. సకలనిగమాగమంబులస్థావరంబు
ధరణిగలవిద్యలకు నెల్ల తావలంబు
భాష కెనలేని నవరత్న భూషణంబు
అఖిలసంపత్కరంబు గ్రంధాలయంబు.

— శ్రీ దూశి వేంకటేశము

## దేవాలయం - గ్రంథాలయం

[౧]

గ్రంథాలయంబెరా! దేవాలయంబు
గమనించి చూడరా! జ్ఞానివౌ నీవు
దేవతామూర్తులా దేవాలయాన
గ్రంథాలపంక్తులీ గ్రంథాలయాన
నిష్ఠతో పూజలా దేవాలయాన
శ్రద్ధతో చదువులీ గ్రంథాలయాన

భక్తికలిగినపూజ ఫలితంబుమిన్న
సారమెరిగినచదువు సౌభాగ్యమన్న
పరులెత్తుమనసుతో పగలంతపూజ
పనికిమాలిన గ్రంధపఠన తనూజ
పత్రిచేతేపూజ భక్తిలేకున్న
చెత్తసాహిత్యంబు చదివివ్యర్థంబు
ఉపదేశమేలేని ఉత్తుత్తపూజ
ఉపయోగమేలేని వృధచదువుకూడ
దేవాలయంబులో తీర్చిపేర్చినవి
ప్రతిమ లెన్నుండినా ఫలితంబులేదు
గ్రంధాలయంబులో గట్టిఅట్టలతో
పెక్కుగ్రంథాలున్న ఫలితంబుసున్న
జ్ఞానంబు నిచ్చునది గ్రంధాలయంబు
దివ్యజ్ఞానంబిచ్చు దేవాలయంబు
చదువులోగలదెంతో సారంబురన్న
భక్తిలోగలదెంతో పరమార్థమన్న
భక్తులెందరికైన భగవంతుడొకడు
కులభేదమేలేదు గుడిలో పూజలకు
పఠితలెందరికైన పఠనాలయంబు
కులభేదములులేవు కూడిచదువంగ
విలువైనగ్రంథాలు కొలదిగానున్న
కొదువేమికాబోదు కొరతేమిలేదు
వాడవాడకు నొక్క దేవాలయంబు
గ్రామగ్రామానికీ గ్రంథాలయంబు

అవసరంబవునండి అతిముఖ్యమండి
అందరూ తెలుసుకొని ఆదరించండి.
గ్రంథాలయంబులే ఘన ఫలితమిచ్చు
ఉండితీరాలండి ఊరూరనొకటి.

— శ్రీ మంత్రి శంకరరెడ్డి

[౨]

దేవాలయం—నాటి గ్రంథాలయం
గ్రంథాలయం—నేటి దేవాలయం॥
వేదాల ఓంకార
నాదాలు పాడారు
విజ్ఞాన బీజాలు
విశ్వాన చల్లారు
వేదాంత తత్వాలు
విష్ణుపూజలలోనె
విశ్వసేవలు చేసి
వెలుగు లందిచ్చారు
దేవాలయం—నాటి గ్రంథాలయం
గ్రంథాలయం—నేటి దేవాలయం॥
వేదాల సారాలు
విడదీసి రాశారు
విజ్ఞానములు పోగు
చేసి చూపించారు

విశ్వసేవలలోనె
విష్ణుపూజలు చేసి
వేదాంతవేత్తలై
వెలు గందుకొన్నారు
దేవాలయం-నాటి గ్రంథాలయం
గ్రంథాలయం-నేటి దేవాలయం

దేవాలయంలోని
దివ్య బింబాలలో
గ్రంథాలయంలోని
గ్రంథరాజాలలో
దేవుడే విశ్వమని
విశ్వమే దేవుడని
వేదాంత తత్వాలు
వినబడును మాకెపుడు
దేవాలయం-నాటి గ్రంథాలయం
గ్రంథాలయం-నేటి దేవాలయం.

— శ్రీ శిష్టా

## గ్రంథాలయమ్

ఆలయములందు ఘనమా
ఆలయము గ్రంథాలయం
జాలసింపక గ్రామ గ్రా
మాలలో స్థాపింపుడీ॥ఆల॥

జ్ఞానమింతయు లేక య
జ్ఞాన తిమిరములోపలన్
దీన జనములకు వి
జ్ఞానభాస్కరమా సుడీ ॥ఆల॥

నూటి కేపదిమందిరో
కూటికీ గల వారలే
మేటివిద్యల నేర్చిరీ
నాటి భారతమందునన్ ॥ఆల॥

విద్యయే జ్ఞాననేత్రం
హృద్య మగు ధర్మక్షేత్రం
అద్యతన భావిసూత్రం
సద్యశః పటహ పాత్రం ॥ఆల॥

పైరు పండించు రైతా!
తీరికా సమయమందూ
చేరు గ్రంథాలయము భూ
సార విజ్ఞాన మొందా ॥ఆల॥

వర్తక మొనర్చు బేహారీ!
వర్తక రహస్యమందున్
పూర్తి విజ్ఞాన మొందా
కర్తవ్య మగు గ్రంథ పఠనమ్ ॥ఆల॥

సకల విధ విజ్ఞానములకున్
ముకుర మీ గ్రంథాలయమ్

కళవికలు చెంద నేలా?
సకల జనులును జేరుడీ ॥ఆల॥

చీట్ల పేకల నాడ నేలా?
కోట్లాటలకు పూన నేలా?
అట్లు కాలము గడుప మేలా?
ఇట్లు గ్రంథాలయము జొరవా? ॥ఆల॥

అన్ని వృత్తుల వారలున్
అన్ని జాతుల వారలున్
చిన్న పెద్దలు స్త్రీలు పురుషులు
చెన్ను మీఱగ జేరుడీ ॥ఆల॥

బాలబాలిక లందఱున్
మేలుగా చిన్ని కథలన్
లీల జదువుచు హర్ష మం
దోల లాడుదు రిచ్చటన్ ॥ఆల॥

రసికులౌ యౌవను లిటన్
హసియింపగా నభిరుచుల్
రస మొలుకు కావ్యాదులన్
రసము గ్రోలుచు నుందురోయ్ ॥ఆల॥

వయసు మళ్ళిన వారికిన్
ప్రియము లౌ వేదాంతముల్
నయముగా నేర్వంగ నా
లయము సుమ్మిది నమ్ముడీ ॥ఆల॥

— శ్రీ జాస్తి

## మహాలయం!

ఓ ఆలయం!
సకల విజ్ఞాన నిలయం!
అజ్ఞానపు చెడు రక్తాన్ని
పరిశుభ్రం చేసే
దేశపు గుండెకాయా?

నీవే మా
సంస్కృతి సర్వస్వానివి,
ఆనందపు కేంద్రానివి.

నీలో రకరకాల
డైనామాలు ఉన్నాయి;
పుస్తకాలను హస్తాలకు
కనెక్టు చేసి,
కండ్లను కేంద్రీకరించి
విద్యుత్తును ప్రవహింప
చేసుకొంటాడు పాఠకుడు.

నీవే మా
ఉత్తమ నాగరికతా చిహ్నానివి;
అభివృద్ధికి సోపానానివి
మా వీరుల ప్రతి బింబాలు
మా ధీరుల కీర్తి పుంజాలు
నీలోనే ప్రతిబింబిస్తాయి;
నీలోనే ప్రతిధ్వనిస్తాయి.

నీవొక

విశాల విజ్ఞాన సముద్రానివి;
సుందరతర నందన వనానివి,
నీలో విహరిస్తూ
నీ అలలతో ఆడుకొంటూ
నీ భావ సువాసనలలో
తేలిపోతారు భావుకులు.
ఓ మహాలయం!
నీ కివే మా నమస్కృతులు.

— శ్రీ సి. హెచ్. ఆచార్య

## గ్రంథాలయ సూక్తులు

శ్రీకరంబును, విబుధ వశీకరంబు
పూజితంబును, సత్కళా రాజితంబు
భాసితంబును, విజ్ఞాన వాసితంబు
శారదాదేవి పీఠంబు సంస్తుతింతు.

అది సమస్త జనాదరణైక సంస్థ
ఉన్నతంబు, నుదారంబు, నుజ్జ్వలంబు,
ఉత్తమోత్తమ, ముత్కృష్ట ముచిత పఠన
మందిరం బెన్న సర్వాంగ సుందరంబు.

గ్రంథ నిలయంబు జాతి వజ్రంబువోలె,
స్వప్రకాశంబు సహజంబు స్వచ్ఛతరము;

ప్రబల గాఢాంధకారంబు పాఱద్రోలి
దివ్యకాంతుల వెదజల్లి తేజరిల్లు.

పుస్తకాలయ మా విరాట్పురుషు లీల
అప్రమేయ, మనంతంబు, నచ్యుతంబు;
అదిస్వయంభువు – తనుదానె ఉదయమంది
విశ్వరూపము ధరియించి వెలయుచుండు.

దాతవోలెను గ్రంథ నికేతనంబు
అర్థిజనములకెల్ల లేదనకయిచ్చు;
అది విశిష్టము, స్వచ్ఛంద, మవ్యయంబు,
మధుర మంజుల భావసమన్వితంబు.

మాతవోలెను పుస్తకమందిరంబు
శాఖఁ దను జేరవచ్చిన వారినెల్ల
భేదమెంచక సమముగ నాదరించి
జాతి మత సంఘ సామరస్యంబు నెఱపు.

మానితంబైన పుస్తకమందిరంబు
సుందరంబు సకలజనానందకరము;
సహజమగు దాని లావణ్యమహిమగాంచి
భ్రాంతుడగును తదీయ నిర్మాణకర్త.

తీర్చి శారదకై సేసి దిద్దుకొనఁగ
మణులమంజూష పుస్తకమందిరంబు,
తళుకు గులికెడు వివిధరత్నముల నందు
కోరికలు దీర జను లేరికొనఁగవచ్చు.

ఆలయంబుల బోలె గ్రంధాలయముల
విమలభక్తిని జనులు సేవింపవలయు;
ఎందు వెదకిన నందని యీశ్వరుండు
కాపురముసేయు నిరతంబు కావ్యవాటి.

తనువురక్తము జీవంబు ధారవోసి,
ఋషివంతసులు పెక్కువేలేండ్లు తపము
సలిపి ఆర్జించినట్టి విజ్ఞానధనము
దాచియుంచిన పేటి గ్రంథాలయంబు.

కవులు వక్తలు రసికులు గాయకులును
చిత్రకారులు నటులు చారిత్రవిదులు
ప్రకృతివేత్తలు జోస్యులు వారికెల్ల
గ్రంథనిలయంబు సర్వదా కాపురంబు.

గాలి నీరును లేకున్న గడపవచ్చు,
గ్రాసమును లేక ఎట్టటో గడపవచ్చు;
గడపవచ్చునె మనమొక్క గడియయైన
గ్రంథభాండారములు లేని గ్రామమందు?

గ్రంథనిలయంబు గల నరకంబు నందు
నైన నివసింపఁ గాంక్షింతుఁగాని, నేను
గ్రంథనిలయంబు లేని స్వర్గంబునందు
నిముసమైనను నివసింప నిచ్ఛగింప.

దేవళంబులు సత్రముల్ సావడులును
చెరువులును వీటలేకున్న కొఱంతలేదు;

దివ్యమగునొక్క గ్రంథమందిరములేని
వీడు వీడుగాదది పాడు బీడుగాని.

గ్రంథనిలయంబు నందలి గ్రంథములకు
గుణమెకాని ప్రధానము, గణముకాదు
ఎన్నియో చెత్తపొత్తము లున్నకన్న
ఉత్తమ గ్రంథములు కొన్ని యున్నజాలు.

ఏను గ్రంథాలయంబున కేగు నపుడు.
గ్రంథములు నాకు కన్పట్టు కనుల యెదుట
ఉద్విజనులకు బోధించి యుద్ధరింప
నేడ్క దివినుండి వచ్చిన విబుధు లనఁగ.

పన్నలడుగదు, తను జేరవచ్చువారి
నన్నివేళల ప్రీతితో నాదరించు,
ఎవ్వరడిగిన నేపొత్తమేని నొసఁగు;
అఖిలజనముల హక్కు గ్రంథాలయంబు.

భాగ్యవంతుఁడు నిరుపేదవాఁ డటంచు
అగ్రకులజుఁడు కడజాతియతఁ డటంచు
ఉచ్చనీచ విభేదంబు లుజ్జగించు;
అఖిలజనముల హక్కు గ్రంథాలయంబు.

అఖిల జాతీయతాభావ మలవరింప
అమల విజ్ఞానసంపద నమరఁ జేయు,
సాంఘికాచారధర్మముల్ సంస్కరింప,
సదమల గ్రంథసదనంబు సాధనంబు.

విమల దేశాభిమానంబు వెలయఁజేయ,
నిఖిలసౌభ్రాత్ర భావంబు నెఱయఁజేయ,
సకలలోక కల్యాణంబు సాఁగఁజేయ,
సదమల గ్రంథసదనంబు సాధనంబు.

పనులయందు ప్రవీణత, పలుకులందు
సరసతయు, ధనార్జనమున చతురతయును,
జీవనంబున సౌఖ్యంబు చెందఁజేయ
సదమల గ్రంథసదనంబు సాధనంబు.

నరులవెతదీర్చి, పాపముల్ మఱువఁజేసి,
భగ్నమగువారి హృదయముల్ పదిలపఱచి
జీవితంబుల సరియైన త్రోవనడప
సదమల గ్రంథసదనంబు సాధనంబు.

సభ్యతకుతావు, కళలకు జన్మభూమి,
భోగభాగ్యముల కిరవు, నాగరికత
కాలవాలము, సంస్కృతి కాటపట్టు;
అఖిల కల్యాణకరము గ్రంథాలయంబు.

పుణ్యములసీమ, గుణముల పుట్టినిల్లు,
ధర్మముల కాకరంబు, సద్గతికి నెలవు,
త్యాగములతావు, నీతికి తావలంబు;
గ్రంథనిలయంబు సకల మంగళకరంబు.

తల్లివలెసాకు, బోధించు తండ్రికరణి,
వంతలడఁగించి రంజించు పత్నివోలె,

దివ్యమగునొక్క గ్రంథమందిరములేని
వీడు వీడుగాదది పాడు బీడుగాని.

గ్రంథనిలయంబు నందలి గ్రంథములకు
గుణమె కాని ప్రధానము, గణముకాదు
ఎన్నియో చెత్తపొత్తము లున్నకన్న
ఉత్తమ గ్రంథములు కొన్ని యున్నజాలు.

ఏను గ్రంథాలయంబున కేగు నపుడు
గ్రంథములు నాకు కన్పట్టు కనుల యెదుట
ఉర్విజనులకు బోధించి యుద్ధరింప
నేడు దివినుండి వచ్చిన విబుధు లనఁగ.

పన్నులడుగదు, తను జేరవచ్చువారి
నన్నివేళల ప్రీతితో నాదరించు,
ఎవ్వరడిగిన నేపొత్తమేని నొసఁగు;
అఖిలజనముల హక్కు గ్రంథాలయంబు.

భాగ్యవంతుఁడు నిరుపేదవాఁ డటంచు
అగ్రకులజుఁడు కడజాతియతఁ డటంచు
ఉచ్చనీచ విభేదంబు లుజ్జగించు;
అఖిలజనముల హక్కు గ్రంథాలయంబు.

అఖిల జాతీయతాభావ మలవరింప
అమల విజ్ఞానసంపద నమరఁజేయు,
సాంఘికాచారధర్ముముల్ సంస్కరింప,
సదమల గ్రంథసదనంబు సాధనంబు.

అడుగు మేదేని-తోనె లేదనక యిచ్చు,
కోరు మేదేని-గొబ్బున కోర్కెలొసఁగు,
వేడు మేదేని - వేగ నీ వేడ్కె దీర్చు,
గ్రంథ నిలయంబు కల్పవృక్షంబుగాదె ?

గ్రంథ నిలయంబు శారద కనకపీఠి,
గ్రంథ నిలయంబు కవుల శృంగారవాటి,
గ్రంథ నిలయంబు విబుధ విజ్ఞానపేటి,
గ్రంథ నిలయంబు మోక్ష సద్గతికి చీటి.

— శ్రీ నాళము

## ఆహ్వానం !

గ్రంథాలయంబునకు రండీ ఒకసారి-
గ్రంథంబులను చూచి పొండీ

కాయముల్ విడిచిన
కవు లెందరో దివ్య
గ్రంథ రూపాలలో
కనుపింతు రిచ్చోట ॥గ్రంథాలయంబునకు॥

భూతకాలాన మన
భూమి యెట్లలరెనో ?
పుట్టుపూర్వోత్తరాల్
గట్టిగా దెలియు నిట ॥గ్రంథాలయంబునకు॥

పాతకాలపు టనుభ
వాలెరిగి నేటి మన

బ్రతుకుబాటను బాగు
పరచుకొనవచ్చునిట ॥గ్రంథాలయంబునకు॥

దేవుడన నెవ్వరో?
దేశమంటే యేమొ?
దేవుణ్ణి దేశాన్ని
తెలిసికొనవచ్చునిట ॥గ్రంథాలయంబునకు॥

— శ్రీ రేమిడిచర్ల

## చదువు పాల్కడలి

పల్లవి

ఎవరి సొమ్మనుకొంటిరయ్యా - ఈగాలి
నెవరు గుత్తగ గొంటిరయ్యా

అనుపల్లవి

ఎవరింట బంధించి యితరులకు లేకుండ
తమ రొక్కరే దీని దాచుకొన గలరయా ॥ఎవరి॥

చరణములు

1. ఎవరి హక్కని ఎంతురయ్యా - ఈ వాన
నెవరడ్డు కట్టగలరయ్యా
దివినుండి భువిపైకి దిగిన అమృతము నెల్ల
యెవ రొక్కరే త్రావి యిముడుచుకొనేరయా ॥ఎవరి॥

2. ఎవరు పెంచిన తోటలయ్యా - చదువులకు
నెవరు మొక్కలు నాటిరయ్యా
ఎవరికందిన పండు వారు దిగమ్రింగితే
అవలివారికి విత్తులైన దక్కునటయ్య ॥ఎవరి॥

3. ఎవరింటిలో దీపమయ్యా – భాస్కరుం
డెవ రతని మాయ గలరయ్యా
ఎవడేని యిను దృష్టి తగులునటు చూచెనా
తన దృష్టికే ముప్పమని యెఱుంగడటయ్యా ॥ఎవరి॥

4. చదువు పాల్కడలి అందరిది – ఇందు మీ
హృదయమును తోడుగా నిడుడీ
సదసద్వివేక మను చల్లకవ్వముతోటి
మథియించి సుఖమెల్ల వారలకు బంచుడీ ॥ఎవరి॥

— శ్రీ శిష్టా

## అసలు బడి

అసలు బడికి రారయా । ఐచ్ఛిక విద్యార్థులు
దెసల కొసల పరిధికెల్ల । దీని కేంద్ర బలమెచెల్లు॥అసలు॥

విసువుగూర్చు వింత పాఠ్య । వివర మిచట లేదయా
కసరి బెత్తమెత్తికొట్టు । కఠిను లిందు లేరయా
విసరివేయుటకును దగని । విజ్ఞపత్రమీరయా
పసికోలంది తెలివినిచట । మెసవవచ్చు రారయా॥అసలు॥

మనసుకింపు నింపునట్టి । మ్రానిపైకి పోరయా
కనులపండువైన కొమ్మ । కాపు జూచుకోరయా
తినెదు పండ్లు కొన్నిటి మా । దెసకు విసరి వేయరయా
తృప్తిగ గ్రంథాలతోట । దిరిగి తిరిగి రారయా॥అసలు॥

బడులలోన చదివి చదివి । బడలిపోయె లోకము
నడుపు నాథులకు కరవై । అడలిపోయె దేశము
బడులుకాదు పుస్తకాల । గుడులు నేడు వలయును – ఆ
గుడులు తెలివితల్లికొలువు । కూటము కావలయును
॥అసలు॥

— శ్రీ శిష్టా

## గ్రంథాలయము లేని యూర

పల్లవి

గ్రంథాలయము లేని యూర–క్షణమైన
కాలు నిలుపక కదలి పోరా

అనుపల్లవి

అంధకారము వంటి–అజ్ఞానమునుండి
బంధుమిత్రుల పోలె–బాగుగా కాపాడు ॥గ్రంథా॥

1. అన్నసత్రములేని చోట–వస్తుండి
మైనమనవచ్చు నొకపూట–
నిన్న జరిగిన వార్త నేడిచ్చు పత్రికలు
కన్నులకు జిక్క–నిది గడువ దొకనాడైన ॥గ్రంథా॥

2. శివుని కోవెల లేని పేట–నామమే
చేసుకొందువుర నీనోట–
కవుల మోమున బుట్టు జ్ఞానదేవత పట్టు
కనులార గాంచకే కలుగ దెవ్వరికైన ॥గ్రంథా॥

3. లక్షాధికారు లీకున్న-ఎట్టిచో
కుక్షి నింపు కొనేవు రన్న-
అక్షరక్షుధ తోడ-వ్యధితుండవై జ్ఞాన
భిక్ష మడిగిన నెవరు-వేయగల రచ్చోట ॥గ్రంథా॥

— శ్రీ శిష్టా

## కదిలే గ్రంథాలయం

కదిలే గ్రంథాలయ
మిదుగో అబ్బాయీ
పదేపదే ఊరూర
ప్రత్యక్షమగు నోయీ-॥కదిలే॥

గట్టి బాటగల చోట్లకు
కారు షికార్లే కొట్టును
మట్టిదార్లపై నైతే
నెత్తి మూటలో నొదుగును
మెట్ట త్రోవ లేకుంటే
మింటి నంటియే పోవును
పట్టణాలకై తే-తొట్టి
పడవలోనే పోవునోయీ-॥కదిలే॥

ప్రకృతి మాత యెడదలోని పరమార్థము లిది తెలుపును
సకలధర్మసాధనలకు సమన్వయము నెలకొలుపును
సుకవిరచనతో జగతికి సుప్రభాత మిది పలుపును
నికరమైన విశ్వశాంతి నిజముగ నిదె నిల్పునోయీ ॥కదిలే॥

— శ్రీ శిష్టా

# పుస్తకాల స్వయంవరం

స్వయంవరం – చాటించారోయ్
త్వరత్వరగా – పయనంకావోయ్
పుస్తకాల – బాలకుమారితో
నేస్తానికి – పోదాం పదవోయ్

నిను వలచిన – చదువుల చానతో
మనసిచ్చి – మాట్లాడాలోయ్
నీ నచ్చిన – మాటలరాణికి
కానుక క – ట్నా లియ్యాలోయ్
స్వయంవగం – చాటించారోయ్
త్వరత్వరగా – పయనం కావోయ్

నిలచిన యీ – కన్నెలలో నిను
వలచీ వల – పించిన దేదో
అందాల – అణువు కణాలా?
ముందు వెనుక – మూడుగుణాలా?
అందని ఆ – కాశం సొబగా?
అందందూ – ఆరని వెలుగా?
భూగోళం – పున్నెము పంటా?
బాగోగుల – పాయనిజంటా?
సంగీతం – సాహిత్యాలా
శాస్త్రాలూ – చారిత్రాలా?
వేదాలూ – వేదాంతాలా?

పలుమతముల – భాగవతాలా?
పల్లెటూరి – చల్లనిగాలా?
చేతిపనుల – చైతన్యాలా?
మితిమించిన – మతపిచ్చులలో
బ్రతికించే – పరమ ప్రేమా?
చితికిన యీ – మానవహృదయం
అతికించే – సత్యాహింసా?
నిలచిన యీ – కన్నెలలో నిను
వలచీ వల – పించినదేదో!

ప్రతి చదువరి – తన చదువేదో
ప్రతి చదువుకు – చదువరి యెవరో
ఏ పుస్తక – మెవ్వరివంతో
యేరుకొనే – రంగస్థలమోయ్
అందరికీ – అన్నిచదువులూ
అందుబాటులో – ఉన్నాయోయ్.
వందల కం – దని విజ్ఞానం
చందాతో – సాధించామోయ్

అందాల – చదువుల కన్నెల
గ్రంథాలయ – సీమకు రావోయ్!
స్వయంవరం – చాటించారోయ్!
త్వరత్వరగా – పయనంకావోయ్!

— శ్రీ శిష్టా

## గ్రంథాలయమున కేగుదమోయ్!

గ్రంథాలయమున కేగుదుమోయ్
జ్ఞానము సంపాదించుదమోయ్—
అందమైన బీరువాలు
ఎందరివో పుస్తకాలు
సుందర పత్రికలు లోక
మందలి విషయంబులుండు ॥గ్రంథా॥
కష్టపడాల్సిన పని లే
దిష్టమైన పుస్తకములు
చదువుకొనగ దొరకును బహు
సౌకర్యము లమరియుండు ॥గ్రంథా॥
పాడువడిన జీవితాలు
బాగుపడు విధానమెరిగి
బ్రతుకుఫలము బడయవచ్చు
పరమాత్ముని గనవచ్చును ॥గ్రంథా॥

— శ్రీ రేమిడిచర్ల

## విద్యా నిలయము

పల్లవి

విద్య సకలార్థ సాధకమోరియన్న
అదిసుంత లేకున్న అంతయును సున్న—

అనుపల్లవి

బుద్ధిమంతుని జేసి పూజ్యతను గడియించి
పెద్దగౌరవమిచ్చి పెంచు నిను గనరన్న—

చరణములు

౧. దొంగదోచగరాని ధనము – విద్య యిల
పొంగిపొరలి పాఱు విజ్ఞానబలము,
సంఘ గౌరవమిచ్చు ఫలము, అదియె దుస్సంగ
వనమును గూల్చు సూటిఆయుధము ॥విద్య॥

౨. రూపహీనుని రూపిచేయు, విద్య కడు
పాపకూపమునుండి పైకెత్తివేయు,
ఆపదల ధైర్యంబు నలయు నీకెపుడు,
బాపి సంశయమెల్ల బంధువై కాయు ॥విద్య॥

౩. ఐకమత్యము మనకు గూర్చు, మనలోని
అంతరంగిక కలహామట్టె బరిమార్చు,
చింతలెల్లబాపి చేజేర్చు సంతసము,
వింతయౌషధ మిద్ది విధిగ సమకూర్చు ॥విద్య॥

౪. జ్ఞానజలనిధి దేల్చునావ, నిన్నెపుడు
పూనికతో నడిపించు పుణ్యంపు త్రోవ,
దానబడి చరియింప లేవ? మానవుని
జ్ఞాన శత్రువునుబాపు గరిమంపుజావ ॥విద్య॥

౫. ఇట్టి విద్యకు నిలయమండి, యరయగను
నట్టి గ్రంథాలయం బాదరించండి,
గట్టి యభిరుచి నటకు రండి, మీకొసగు
నట్టి యభిమతమైన యమృతంబు నుండి ॥విద్య॥

౬. దేశవార్తల నెల్ల దెల్పు, మీ కచట
దోసి లొగ్గుచు సేవ తొలుదొల్త సల్పు,

భాష పరిచయమెల్ల నిల్పు, కోరికల
మోసగించక దీర్చి మురిపెమును గొల్పు ॥విద్య॥

౭. ఊరూర గ్రంథాలయములు, నెలకొన్న
పేరుగాంతురు యశము బొంది యీ జనులు,
తీరుబాటునుగల్గి పనులు, విడనాడి
నేరుతురు విద్యను నెరవేర్చ సద్బుధులు ॥విద్య॥

౮. మానసిక తత్వమునుగాంచి, దానికగు
మందు మంచిది దీసి మనసులోనుంచి,
పూనికతో స్థిరచిత్తముంచి, మలుగూరి
దానవారినిగాంచు ధర్మములముంచు ॥విద్య॥

— శ్రీ మలుగూరు టి. గురుమూర్తి

## మరుభూమిలో జలధార

పల్లవి

మరుభూమిలో జలధారరా
మనపాలి గ్రంథాలయమురా ॥మరు॥

అనుపల్లవి

పరమార్థ దర్శన దాహమును ఎడ
బాపికొన చలివేంద్రరా ॥మరు॥

చరణములు

౧. జ్ఞానవారిధిమీది యావిరి
జలదమై కురిపించెరా – ఇట
తానమాడి తనియ గ్రోలి
తపన తీర్చుకొనేమురా ॥మరు॥

౨. ఏండ్లు పూండ్లుగ నెఱుక తడి లే
కెండిపోయిన జనతకు
యెడదనిండుగ తెలివి నిచ్చే
ఏరు లిచ్చట పారురా ॥మరు॥

౩. ఇదియె మొదలై యెల్లెడల ప్రవ
హించు జ్ఞానామృతముతో
పదనుకొను హృత్క్షేత్రములలో
పండునర సుఖశాంతులు ॥మరు॥

— శ్రీ శిష్టా

## ఇక్కడనే

ఇక్కడనే - యిక్కడనే
ఎక్కువ తక్కువ చూడని
చక్కని సామాజికులగు ॥టిక్కడనే॥

ఒక్కడు లక్షాధికారి
ఒక్కడు బుక్కా పకీరు
ప్రక్కప్రక్క గూరుచుండి
పత్రిక పరిశీలించే ॥దిక్కడనే॥

ఒకడు భూమి కామందు
ఒకడు సేవకుండందు
నికరమైన చందాతో
నిఖిలమునకు స్వాములయే ॥దిక్కడనే॥

ప్రతిమానిసి కొక ఓటట
బతిమాలిన మతిలేదట
పదిశిరసుల రక్కసులకు
మొదలే స్థానం లేదను ॥ఇక్కడనే॥
ప్రజారాజ్య శాస్త్రానికి
బాలశిక్ష యిదియేనట
సజీవమగు సంఘానికి
నిజానికిది పునాదియట ॥ఇక్కడనే॥

— శ్రీ శిష్ట్లా

## ఐక్య భావ సమితి

పల్లవి

మీటింగుకు వస్తారా–ఓటింగట చేస్తారా?
నాటి నేటి మహనీయుల నడకలు గమనిస్తారా? ॥మీటిం॥

అనుపల్లవి

ఐక్యభావసమితివారి ఆహ్వానం అందిందా?
లౌక్య పారలౌక్య శాంతియేలక్ష్యం! తెలిసిందా? ॥మీటిం॥

చరణములు

1. ఆర్యఋషులు వస్తారు–సూర్యు నుపాసిస్తారు
ఆదికవులు వస్తారు–వేదకథ పఠిస్తారు
ధైర్య సాహసమ్ములు గల–ధరణిపతులు వస్తారు
తలచి తుద కహింసా సత్యములు ప్రబోధిస్తారు! ॥మీటిం॥
2. విజ్ఞానులు వస్తారు–విమానాలు తెస్తారు
ప్రజ్ఞావంతులు చంద్రుని పైకి దాడి చేస్తారు

అజ్ఞానులు సైతం చేతైన రభస చేస్తారు
జిజ్ఞాసువుల మనసుకు గిలిగింతలు కలిగిస్తారు! ॥మీ॥టిం॥

3. పాశ్చాత్యులు వస్తారు-వ్యాపారంచేస్తారు
ఆశ్చర్యంగా దేశపు ఆకృతి మారుస్తారు
నిశ్చల మతి బాపూజీ నీతిప్రీతి తప్పకయే
నిశ్చేష్టులజేసి వారి నెట్టిపారవేస్తాడు! ॥మీ॥టిం॥

4. లెక్కలేని భావాలకు ఇక్కడ జరిగే ఘర్షణ
ఒక్కసారి వచ్చి సహృదయులు పరిశీలిస్తారా?
బుక్కునుండి స్పుత్నిక్ వరకెక్కివచ్చినట్టి తెలివి
చెక్కుచెదరకుండచేసి చక్కగ రక్షిస్తారా? ॥మీ॥టిం॥

— శ్రీ శిష్ట్లా

## ఏదో తెలుసా?

పల్లవి

ఏదో తెలుసా? అప్పుడు-సాధించింది స్వరాజ్యం?

అనుపల్లవి

వైదేశిక పరిపాలన వద్దన్న మగాడి కెల్ల
వాగ్బంధమై అష్ట దిగ్బంధం జరిగిందే
ఏదో తెలుసా, అప్పుడు సాగించింది ప్రచారం

చరణములు

1. తెల్లదొరతనం వద్దని బల్లగుద్దుకొనే వాళ్లు
నల్లచువ్వ వెనకాలకు చల్లగ దయ చేశారే
ఏదో తెలుసా, అప్పుడు జరిపించింది ప్రబోధం?

2. నోరెత్తిందే చాలు–నూట్నలభై నాలుగని
ఊరూరూ దమననీతి–ఉప్పెనలో మునిగిందే
ఏదో తెలుసా అప్పుడు చేసె పునర్నిర్మాణం?
3. అదేగదా గ్రంథాలయ–మదేగదా కళానిలయ
మదేగదా జిజ్ఞాసువు లాడుకొనే బృందావన
మచ్చట సద్గ్రంథ తరువు–లాకాశం అంటునవి
అచ్చటి పత్రికాలతిక–లన్ని దెసలు ప్రాకినవి
అచ్చటి వివిధాదర్శాలనే గోపికలనుగూడి
నిత్యం జ్ఞానానందుడు నృత్యం చేస్తుంటాడు
ముచ్చటగా శాంతి విశ్వమోహనుడికి రాధికయై
వచ్చి నిలిచి ముజ్జగాల వంతలు తీరుస్తుంది!
అదేగదా గ్రంథాలయం అదేగదా కళానిలయం
అదేగదా జిజ్ఞాసువు లాడుకొనే బృందావనం!

— శ్రీ శిష్టా

**ప్రతి పుస్తకానికీ ఒక చదువరి**
**ప్రతి చదువరికీ తన పుస్తకం**

ప్రతి పొత్తమునకు చదువరి నొక్కని
ప్రతి చదువరికిని తన పొత్తంబును
సమకూర్చుటయే సాధ్యమైనచో
గ్రంథాలయముల పఠనాలయముల
ప్రయోజనం బది సిద్ధించున్.
ఇందునిమిత్తమె అందరు జేరి
గ్రంథాలయ సంఘంబులబెట్టి

గ్రంథాలయ శిక్షణమును నేర్చి
ఒకరియనుభవము నొకరు దెలిసికొన
గ్రంథాలయ పఠనాలయంబులవి
కావలసిన బలమును గడించుకొని
కాలముతో వర్ధిల్లున్.
శిక్షణలేని శక్తిహీనుల
అండ జేరిన భాండారంబులు
చక్కగ చదువని సామాన్యులచే
నిర్వహింపబడు నికేతనంబులు
సేవాతత్వము జీర్ణించక మరి
ఉదాసీనమే ఉద్యోగముగా
గలిగినయట్టి గ్రంథపాలకులు
పాలించెడి యా పఠనాలయములు.

— శ్రీ పాతూరి

జ్ఞాన భాగ్యంబు గలుగదు చదువకున్న

సీ. మంచిమందంచును సంచిలోనుంచిన
రోగంబుమాన్పి యారోగ్యమిచ్చునె?
ఫలము మంచిదటంచు వర్ణించి తినకుండ
దాఁచినచో జిహ్వతనియఁగలదె?
చల్లదనంబిచ్చు చందనంబని చెప్పి
పూయక సుఖమెట్లు పొందఁగలఁడు?
భాగ్యంబుగలదంచు వాడకయుండిన
భాగ్యసౌఖ్యము వాఁడు వడయునెట్లు?

జ్ఞానదాయక గ్రంథముల్ చాలదెచ్చి
బీరువాలను నిండించి పెట్టునంత
జ్ఞానభాగ్యంబు కలుగదు చదువకున్న
ఇంటిలోవిత్తులుంచఁ జేనెట్లుపండు?

— శ్రీ ఆచంట సూర్యనారాయణ సాంఖ్యాయనశర్మ

## లైబ్రరీలో

పెరిగి తిరిగితి మంచికోసము
విరిగిపోయితి మంచి కానక
పెరిగివిరిగి విరిగితరిగీ
బేలనై పోతిన్.

ఇమిడిపోవని ఏడ్పునంతా
ఎక్కిరిస్తారన్న భయమున
అణచుకొని లోలోన-చెప్పకె
అణగిపోతున్నా ... ... ...

వేదనలతో విసిగిపోతూ
వెళ్లితిని గ్రంథాలయమ్మునకు
బంధువుల్లా పుస్తకమ్ములు
పలుకరించినవి!

అక్షరాకృతినున్న దివ్యులు
అమృతమూర్తులు స్నేహితుల్లా
తరుమకే నా కష్టకథలను
తామె విన్నారు!

తమ కష్టసుఖముల గోడునంతా
    తాము చెప్పారు!
కష్టపడితేగాని సుఖమూ
    గలుగ దన్నారు!

    తెలిసికొంటిని, విశ్వమంతా
    తిరిగివస్తిని, అనుభవ మనే
    జ్ఞాననేత్రంతోటి యిప్పుడు
    నేను చూస్తున్నా.

మంచిలోపలచెడ్డ, చెడులో
మంచియూ కనిపించుచుండెను
వెలుగులోపల నుండుచీకటి
వెలుగు — చీకట్లో.

    వీడిపోయెను దుఃఖభారం
    రేగుతూన్నది "జ్ఞానపిచ్చి"
    కదలకే గ్రంథాలయమ్ము మ
    కాము వేస్తూంటా!

నన్నుగని ఆ దివ్యమూర్తులు
    నాటికీ నేటికీ కూడా
కష్టపడితేగాని సుఖమూ
    కలుగదంటారు!

— శ్రీ జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి

## గ్రంథాలయోద్యమము

[౧]

ఎఱుక ఎల్లరకును కూర్చు హేతువునను
ఉత్తమము చుండి గ్రంథాలయోద్యమంబు;
ఎల్లకడఁకలు దీనిలో ఇముడునవియె;
కాన, ఇయ్యదియే ధరాకల్పతరువు.

[౨]

సీ. విన సొంపు నింపెడు విమల గాంధర్వంబు
నలరించు మేటి గాయకులు లేరు
రమణీయ జాతిగీతములను రచియించి
పాడింపగల కవీశ్వరులు లేరు
లలిత నూతన కళా కలితరీతిని యంత్ర
ములు సేయఁగల కార్మికులును లేరు
ప్రకృతి పదార్థ జీవజ్యోతి శోధించి
భాతృభూమిఁదరించువారు లేరు
దేశమును సంఘమును సముదీర్ణ వృత్తి
నరసి యుద్ధరింపగల నాయకులు లేరు
అట్టి మన పూర్వికుల కథ లరలయందు
పుస్తకాకృతి వీక్షింపఁ బోలునింక.

సీ. దేశాభిమానంబు దీపింప నూరూర
గ్రంథాలయములుంచి గ్రాలవలయు
సంఘ సంస్కారంబు సవరింప నూరూర
గ్రంథాన్వయము జెప్ప గడగవలయు

జాత్యభివృద్ధి విచారింప నూరూర
 గ్రంథార్థ పఠనంబు గడపవలయు
జన్మభూమికి మేలు సలుపుట కూరూర
 గ్రంథదర్శన వృత్తి గాంచవలయు
అటులగాకున్న శుష్క వాక్యములవలన
ఫలము చేకూర దాంధ్రుల భావి జీవి
తమ మహానర్థములగూలి తల్లడిల్లు
గాన భారతికొక యిల్లు గట్టుడయ్య.

— శ్రీ ఉమర్ ఆలీషాకవి

[3]

సీ. శ్రీ భారతీసతి స్థిర నివాసంబున
 కాలవాలములు గ్రంథాలయములు
అజ్ఞాన తిమిరంబు హరియింప విమల వి
 ద్యా విలాసములు గ్రంథాలయములు
సాంఘిక మత రహస్యము లెల్ల దెల్పు స
 ద్ధర్మాలయములు గ్రంథాలయములు
జాతీయ గౌరవాస్పద నిరాటంక శు
 భాదర్శకములు గ్రంథాలయములు

తే. ఇట్టి గ్రంథాలయోద్యమ మెల్ల గతుల
విస్తరింపగ భాషాభివృద్ధిగాంచి
భారతీయులు తొల్లింటి భంగి మెరయ
విన్నవించెద నీచిన్ని విన్నపంబు.

సీ. మన పూర్వవిజ్ఞానఖని విరాజిలుటకు
గ్రంథాలయములె సత్కారణములు
మన సనాతనధర్మ మహిమోన్నతికి సదా
గ్రంథాలయములె సత్కారణములు
మన సహోదరుల సన్మార్గాభివృద్ధికి
గ్రంథాలయములె సత్కారణములు
మన దేశ మైకమత్య నిరూఢి గనుటకు
గ్రంథాలయములె సత్కారణములు
తే. ఇట్టి గ్రంధాలయోద్యమ మెల్లగతుల
విస్తరింపగ భాషాభివృద్ధిగాంచి
భారతీయులు తొల్లింటి భంగి మెరయ
విన్నవించెద నీచిన్ని విన్నపంబు.

— శ్రీ ఏనుగు తిమ్మకవి

[౪]

సీ. సకల వేదోపనిషత్సారమైన నా
దబ్రహ్మమునకు మరుత్ స్థానమగుచు
జ్యోతిష్కులకు గ్రహచార ఫలంబుల
సమకూర్చు సంయమ స్థానమగుచు
సకల ఖగోళ శాస్త్రజ్ఞుల కద్భుతం
బైతగు దుర్నిరీక్షణీయయంత్రమగుచు
పాలనాలౌకిక వ్యవహార రాజ్యాంగ
మంత్రణంబునకు మేల్ మంత్రియగుచు
గణితజ్ఞులకునెల్ల గణితశాస్త్రాద్యంత
ముం దెల్పగల పూర్ణబిందువగుచు

మంత్రశాస్త్రవిశేష మహనీయతను జూప
విమల మాథర్వణవేదమగుచు
దేశచరిత్ర నతిస్వచ్ఛముగ దెల్ప
జేవనొప్పెడి స్థిరజీవియగుచు
భూగోళనిర్మాణ భూరిగైరిక ధాతు
చయముల జూప నంజనమునగుచు
సంఘసంస్కరణావసరత పద్ధతులను
సరిగజెప్పెడి మతాచార్యమగుచు
సంగీతసాహిత్య శబ్దమాధుర్య స
ర్వస్వముల్ మీటు విపంచియగుచు

తే. అలరువిజ్ఞాన ఖనియె గ్రంథాలయంబు
అట్టిగ్రంథాలయముల నీయాంధ్రభూమి
వృద్ధిచేయుడి యూరూర వెలయజేసి
మానధనులార దేశాభిమానులార

— శ్రీ అక్కరాజు రాఘవరావు

[౫]

సీ. అక్షరజ్ఞులకెల్ల యమిత జ్ఞానం బిచ్చి
సతతంబుకాపాడు సంస్థ యగుచు
ఐకమత్య విహీను లాంధ్రులంచను మారు
బాపగాజేయు స్వరూపమగుచు
విలువయగు కాలము వ్యర్థమై పోకుండ
సత్కథాలాపనల్ జలుపదగుచు

స్వీయ వైదేశిక చిత్రవార్తల దెల్పు
పత్రికాళిని జేర్ప పాత్రమగుచు

గీ. దేశమర్థింపదగిన దెద్దేనియున్న
వాని నన్నిటి సమకూర్పవలయు ననుచు
స్వీయజనులకు బోధనల్ జేయుచుండు
ఆంధ్రగ్రంథాలయోద్యమం బధికమగుత.

— శ్రీసత్తెనపల్లి హనుమంతరావు

# ౪. ప్రయోజన విద్య

## చదువుల ప్రయోజనం

చదువులు చదువుటకన్న – బహు
శాస్త్రజ్ఞానము కేది స్తోవన్న ? ॥చదు॥

ఆ చదువు మనకు రాకున్న – మన
సంసారములను సుఖములు సున్న ॥చదు॥

చింతలను తొలగించు – సిరిని తన
చెంతకును పిలిపించు – యెన్నో
మంతనముల నెఱిగించు – ధీ
మంతులుగా జనముల నొనరించు ॥చదు॥

వినయములకు అది నెలవు – బహు
విద్దియలందున గలవు – వృ
త్తులకును గూర్చును చెలువు – ని
స్తులమని దానిని బిలువు ॥చదు॥

ఇహ సౌఖ్యము కది వెరవు – మోక్షపు
మహలున కదియే తెరవు
అదియుంటే కలుగదు కరువు
లేకుంటే బ్రతుకే బరువు ॥చదు॥

— శ్రీ గరిమెళ్ళ

## చదువుకోండోయ్, చదువుకోండోయ్

చదువురాని పెద్దలంతా
చదువుకొందురుగాని రండోయ్
చదువుకొందురుగాని రండోయ్

చదువుసులభము వ్రాతసులభము
చాలసులభం తెలుగుచదువూ ॥చదు॥

సులువుపద్ధతి సులభమార్గము
తల్లిబాసను నేర్వరండోయ్
తప్పకుండా నేర్వరండోయ్ ॥చదు॥

అక్షరంబె సూర్యుడండోయ్
మీదెరాజ్యం అయినదండోయ్
చదువుకుంటే బాగుపడునోయ్
చదువుకోండోయ్ చదువుకోండోయ్ ॥చదు॥

— శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు

## చదువుకోవోయ్ - చదువుకోవోయ్

చదువుకోవోయ్ – చదువుకోవోయ్
చదువుకోవోయ్ – చదువుకోవోయ్

౧. చదువుకుంటే సకలలోకం – ఎదుటగనపడి ఎరుకకలుగును
ముదిమియనుచును మదిని తలచకు – చదువుకొనుటకు
అదునుఏమిటి ?

౨. తాతతండ్రులనాటి కథలూ – తరతరంబుల నాటిగాథలు
మరపురావవిచదువుకుంటే–పరువుగల్గి బ్రతుకవచ్చును॥చ॥

3. పిల్లవారలు చదువుకుంటే – పెందలాడే రాదుచదువూ
పెద్దవారై తేను విద్దెలు – పెందలాడే నేర్వవచ్చును ॥చ॥

౪. పొలముసెట్టుల సాగుచేయుటో–పొట్టనెట్టుల బోసుకొనుటో
తెలుగుమీరి తిరుంగుటెట్టులో – తెలియుబాగా చదువు
కుంటే ॥చ॥

౫. దేశమందలి తీరు తెలియును – తెలివి తేటలు దిట్టపడునూ
మాటకారితనమువచ్చును – మంచిబుద్ధికలుగుగనుక ॥చ॥

౬. మనుజులకునూపశువులకునూ–మధ్యభేదం చదువెకాదా ?
అన్నిపనులూఅవియుమనవలె–ఆచరించుట నెరుగునీవు॥చ॥

౭. భూమిపుత్రా మేడమిద్దెలు – భోగభాగ్యాల్ నాగరీకత
చదువుకున్నవారికబ్బెను – చక్కగా యోచించుకోవోయ్
॥చ॥

౮. తిండి గుడ్డా రెండుగలిగీ – తిరుగదలచితె దేశమందున
పెద్దపేరునుపొందజూచిన–విద్దెవేగమెనేర్చుకోవోయ్ ॥చ॥

— శ్రీ ఆరవెల్లి

## ఓ ! చదువు లేని పెద్దవాడ !

ఓ చదువు లేని పెద్దవాడ!
చదువు కోను సాగిరావోయీ ॥ఓ॥

చదువులేక నీవు యెంతో
సన్నగిలి పోయావు తండ్రీ
చదువుకుంటే చాలా మంచిది ॥ఓ॥

1. ఎండలోన – వానలోన
బండచాకిరి – చేసినా నీ
గుండె ఎండి కడుపు మండునుగా!
ఓ చదువులేని – పెద్దవాడా!
దీనివైనం నీవు గన్నావా? ॥ఓ॥

2. చదువుకుంటే నీవు చేసే
చిన్నపనిలో కూడ నేర్పు
గలుగుతాదని – తెలుసుకోవోయీ
ఓ చదువులేని పెద్దవాడ! ॥ఓ॥

3. పంటలెక్కలు చూచుటెట్లో
యింటిఖర్చులు వ్రాయుటెట్లో
తంటలేకను వ్రాయగలవోయీ
ఓ చదువు లేని పెద్దవాడ! ॥ఓ॥

4. చదువుకోని వారి పిల్లల
చదువుకూడ సన్నగిలునోయ్
చదువు లోని శక్తిగనవోయీ
ఓ చదువులేని పెద్దవాడ! ॥ఓ॥

— శ్రీనర్రావుల వెంకటసుబ్బారావు

## సో ద రా!

అక్షరాలను నేర్వరా సోదరా!
అజ్ఞానమును వీడరా
ఉత్తరము వ్రాయుమని
పత్తరము వ్రాయుమని

ఎవరినో బ్రతిమాలు
కెన్నాళ్లు? ఇకనీవు ॥అక్ష॥

గ్రామాంతరమునందు
కాపురము జేయు నీ
అమ్మాయికొక జాబు
అంపుకొందువుగాని ॥అక్ష॥

"మానాన్న వ్రాశాడు
మావాళ్ల సేమాలు"
అంటు నీఅమ్మాయి
ఆనందపడుతుంది ॥అక్ష॥

— శ్రీ రేమిడిచర్ల

## రైతు చదువు

చక్కగాను రైతులంత - చదువు నేర్వండోయ్
చదువునేర్చి జీవితములు - చక్కపరచండోయ్!
మీరు, సంస్కరించండోయ్!

ప్రాణికోటిలోన నరుని - పాత్ర మేలండోయ్ అందు
ప్రాణరక్షణమును సేయు - రైతు మేలండోయ్! ॥చక్క॥

విశ్వమునకు ఆహారము - బెట్టుదాతండోయ్ రైతు
విద్యనేర్వకున్న జాల - బెడద యుండండోయ్! ॥చక్క॥

తెలివితోడ మీకృషి వర్ధిలగ జేయండోయ్ అట్టి
తెలివిరాదు విద్యలేక తెలుసుకోరండోయ్! ॥చక్క॥

ఇహాపరముల రెంటిఫలము – ఇందు వుండండోయ్ మీరు
ఇట్టి విద్య నేర్చిన మే – లెంతో వుండండోయ్ ! ॥చక్క॥

— శ్రీ రేమిడిచర్ల

## విద్యనేర్వాలెమ్మ

(కళ్లతెరచికనరా—అనుమాదిరి)

విద్య నేర్వాలెమ్మ – పెద్దల బడికి వేగరమ్మ
బుద్ధివికాసమొందు సుమ్మ ॥విద్య॥

1. ఒద్దికతోడుత – విద్య నేర్చుకొని
మొద్దుతనమువిడి సుద్దులు దెలుసుక
పద్దులు పద్దెంబులు మొదలగునవి
ముద్దుగ జదువుచు మురిపెమునొందగ ॥విద్య॥

2. కృషీవలుడ లేరా సృష్టికి – పోషకుండ రారా!
నిష్ఠతో విద్య నేర్చుకొనర
పొరుగు దేశముతో పోల్చిచూడరా
విద్యయందు మనమెంతో వెనుకయి
విజ్ఞానంబును పొందలేకను
అజ్ఞానంబున – అణగియుంటిమి ॥విద్య॥

3. కూలియువక లేరా – జాలమదేల బడికిరారా
మేలుగ విద్య నేర్చుకొనర
కోరికమీరగ తీరికవేళల
నేరుపుతోడుత విద్య నేర్చుకొని
సరివారలతో సరిసమానమౌ

పేరుప్రతిష్ఠల బెంచుకొనియును
గౌరవమును మర్యాదను బొందగ ॥విద్య॥

4. విద్యలేనివాడు వింతపశువె యనెడు పాడు
వాడుకగలదు నేడుచూడు
ఇట్టిపేరు మనకేల వినుమురా
పట్టి వేగ పలకా బలపంబుల
నెట్టివేయ నీమూఢత్వంబును
పట్టుదలతో పరనంబును సల్పుము ॥విద్య॥

— శ్రీ శీలం వెంకటకృష్ణారెడ్డి

## చదువు మూడవ నేత్రమేనండీ!

(కోడెకారు చిన్నవాడా—అనుమాదిరి)

చదువురాని చిన్నన్నయ్యా చదువుకోని పెద్దన్నయ్యా
చదువుకోను సాగిరావయ్యా చలమేలనయ్యా
చదువుకొంటే మేలుగలదయ్యా చలమేలనయ్యా
॥చదువుకొంటే॥

చదువురాని అమ్మల్లారా చదువుకోని అక్కల్లారా
చదువుకోను సాగిరారమ్మా చలమేలనమ్మా
చదువుకొంటే మేలుగలదమ్మా చలమేలనమ్మా
॥చదువుకొంటే॥

ఓటువిలువ తెలుసుకొనగ నోటులెక్కల జూచుకొనగ
వాటమైన చదువునేర్వాలోయ్ ఓ చిన్నన్నయ్యా
మేటిపేవయి మెప్పుబొందాలోయ్ ఓ పెద్దన్నయ్యా
సాటివారలు మెచ్చుకోవాలోయ్ ॥సాటివారలు॥

ఇంటిలెక్కల వ్రాసుకొనగ చంటిపిల్లల సాకుకొనగ
"కంటిరెప్ప" చదువు మనకమ్మా ఓ అమ్మల్లారా
వెంటనే మాబడికి రారమ్మా ఓ అమ్మల్లారా ॥వెంటనే॥

వార్తలెన్నో తెలుసుకొనగ కీర్తినెంతో బెంచుకొనగ
కర్తచదువని తెలుసుకొనరండీ ఓ అన్నల్లారా
వర్తనము సరిజేయు చదువండీ ఓ అన్నల్లారా ॥వర్తనము॥

కొద్దినెలలకె విద్యనేర్పి దిద్దిమిమ్ముల తీర్చగలిగే
పద్ధతులు మావద్దను గలవండీ ఓ అమ్మల్లారా
శ్రద్ధగా మాబడికి రారండీ ఓ అమ్మల్లారా ॥శ్రద్ధగా॥

పత్రికలను చదువుకొనగ గాత్రమెత్తి పాడుకొనగ
రాత్రికేంద్రంచేరి చదవండీ ఓ అన్నల్లారా
"చదువుమూడవ నేత్రమేనండీ" ఓ అన్నల్లారా ॥చదువు॥

"ఆడవారు చదువుకొంటే అందరూ యిల చదివినట్లే"
అందుకై స్త్రీలందరు చదవండీ ఓ అమ్మల్లారా
"చదువుమూడవ నేత్రమేనండీ" ఓఅమ్మల్లారా ॥చదువు॥

— శ్రీ శిలం

## రావోయీ యువజనుడా !

రావోయీ రావోయీ
రావోయీ యువజనుడా
రాత్రి పూట నీవిద్దెలు నేర్వను
రయమున కదలి రావోయీ ॥రావోయీ॥

విద్యనేర్చుటకు బుద్ధి కుదిరిన
మొద్దుతనమె మనకుండదుగా
పరివారలలో పరువును గలిగి
పరిసమానముగ మసలొచ్చున్ ॥రావోయీ॥

నీ రహస్యముల అక్షరాలలో
నీవే వ్రాయను చదువను వీలగు
పంట లెక్కలు, యింటిఖర్చులు
లావాదేవీ వ్యవహారాలు
సొంతంగా నీవు వ్రాయగలుగుతావ్
యెంతో లాభం పొంద గలుగుతావ్ ॥రావోయీ॥

గంటగంటకూ ప్రపంచమంతా
గంతులువేస్తూ సాగుచున్నదోయ్
దినదినానికీ ప్రపంచకంలో
దిగ్భ్రమచెందే మార్పులు కలుగును॥

మార్పులుమనకూ తెలియాలంటే
మార్పులతో మనం మారాలంటే
మనకూ చదువులు రావాలోయ్
మనమూ చదువులు నేర్వాలోయ్॥

— శ్రీ నర్రావుల

## యేమోయీ యువజనుడా!

యేమోయీ యువజనుడా
యెందులకోయీ సంతాపం

చదువూ సంధ్యలు లేవే మాకని
చతికిలపడుటా ఎందులకోయ్॥ ॥యేమోయీ॥

నేటిపెద్దలూ నేటిప్రభుత్వం
నీదు దుస్థితిని గుర్తించారోయ్
ఊరూరాయొక యువజనకేంద్రము
ఉచితంగానే పెట్టుచుండిరోయ్॥ ॥యేమోయీ॥

యువజనకేంద్రము యువజనులందరి
ఉన్నతికోయ్ మరివిద్దెలకోయ్
కేంద్రంబునకొక అయ్యవార్లు నీ
కోసము ఉండును చదివించన్॥ ॥యేమోయీ॥

నోరుతిరుగని మాటలు మాకు
నేర్పుటకగునా అంటున్నావా?
తేలికమాటల పుస్తకాలను
తెలుగులోవ్రాశార్ నీకోసంగా॥ ॥యేమోయీ॥

ఇప్పుడుమాకు చదువులునేర్చిన
వచ్చినపెట్టిన అంటారేమో?
పిన్నలకుండిన బుద్ధిబలానికి
ఎన్నెన్నో రెట్లుండును మీకు॥ ॥యేమోయీ॥

పెద్దల అనుభవ యింగితజ్ఞానాల్
పెద్దలచదువుకు ఎంతయుతోడ్పడు
చదువంటే మహాకష్టంగాదు
చదువంటే మీభాషకు గుర్తులె॥ ॥యేమోయీ॥

విద్యంటేమరి ఊరక ఉండా
పదియేండ్లన్నా చదవొద్దందుర!
ఏండ్లతరబడీ చదువులు చెప్పుట
పెద్దలవిద్యా పద్ధతిగాదు. ॥యేమోయీ॥

పెద్దలవిద్యా పద్ధతిద్వారా
కొద్దినెలలకే విద్యలు వస్తాయ్
రాత్రిపూట మేం అలసటతోను
గంటలకొద్దీ చదువుట యెట్లన? ॥యేమోయీ॥

రాత్రిపూటలు రాలేకుంటే
తీరిక సమయం యేదైనాసరె
రోజుకుగంటా యెప్పుడైననూ
కూర్చొగలిగితె అంతేచాలు॥ ॥యేమోయీ॥

— శ్రీ వరాపుల

## దండామయా మీకు దండామయా!

దండామయా – మీకు దండామయా
మన పెద్దలందరికి – దండామయా ॥దండా॥

1. స్వాతంత్ర్యమొచ్చినా – సంఘమే ప్రబలినా
చదువులేనిది ఉత్త – సున్నైనయా
అసలక్షరాలనే – ఆదరించనినాడు
మొత్తానికే మోస – మొస్తుందయా ॥దండా॥

2. అ ఆలు రానట్టి – అన్నయ్యలందరిని
అక్షరాస్యుల జేసి – తీరాలయా

అజ్ఞానులందరికి – అన్యాయములు సేయు
అయ్యలందరి ఆట – కట్టాలయా ॥దండా॥
3. విద్యాభిమానమ్ము – విరివిగా నాటుకొని
విశ్వానికే వెలుగు – రావాలయా
పద్దు వ్రాతలు మొదట – పత్రికా పఠనమ్ము
పట్టుదలతో మీరు – పట్టాలయా ॥దండా॥
4. ప న స తో మొదలెట్టి – పనసపండూవంటి
ప స ప స లుగల విద్య – చెబుతారయా
నస నగులు లేనట్టి – నవ్యమార్గాలతో
నాల్గునెలలకె చదువు – వస్తుందయా ॥దండా॥
5. కాలమే మారింది – కథలన్ని తిరిగాయి
కళ్లు తెరిచే కాల – మొచ్చిందయా
కడుపు నిండా తిండి – కట్టుకుందుకు గుడ్డ
కలిగినా కాస్తంత – చదవాలయా ॥దండా॥
6. పదిమందినీ వేడి – బ్రతిమాలి చెబుతూంటె
పదిరాళ్లకోసమని – పలికేరయా
భారతావనిలోని – బడిపంతులము మేము
పైసాలతో మీకు – పనిలేదయా ॥దండా॥

## పెద్దల బడి .... .... ....

(తండ్రి – కొడుకుల సంభాషణ)

వచన గానము

కొడుకు :

ఏమండీ నాన్నగారూ!
ఏమిటండీ మా బడిలో

ప్రతిరోజూ రాత్రి పూట
మా పంతులుగారి వద్ద
పెద్దలంతా కూర్చొని
పలకా బలపం పుచ్చుకొని
చిన్నవాళ్ల మాదిరిగా
చదువు కొంటూ వుంటారు!

తండ్రి :

అవునురా నాయనా! అవును
మన బారత భూమిలోన
రామరాజ్య సంస్థాపన
స్థిరముగ జరగాలంటే
పలకలు బలపాలే గాదు
పుస్తకాలు చేతబట్టి
పత్రికలను తెరచిపెట్టి
జనమంతా చదవాలి.

కొడుకు :

అదికాదు నాన్నగారూ !
అంత పెద్దవాళ్ల కిపుడు
ఎందుకండీ యీ చదువులు?
ఉద్యోగాల్ చేస్తారా? ఊళ్లేల్తారా?

తండ్రి :

ఉద్యోగాలకు కాదుర
చదువుకొనేదివారు

"చదువురానివాడు చవట
చదువే మనకు సమస్తము
చదువే మూడవ నేత్రము
ఇలలో దాచిన ధనము"
ఈ సూక్తిని నీ వెరుగవు.
చదువువలని లాభాలను
ఇంకను చెప్పెద విను.

కొడుకు :

(ఆతురతతో) చెప్పండి! చెప్పండి!

తండ్రి :

వినయము నిది యొసగును
మంచి చెడుల తెలుపును
కలిమిని బలిమిని కూర్చును
కోరికలను నెరవేర్చును
ఇహాపర లోకంబులలో
సుఖశాంతుల నొడగూర్చును.
చదువనగా సామాన్యమ ?
దొంగల కిది యలవికాదు
పంచుకొనగ వీలులేదు
ఇచ్చిన కొలదిని పెరుగును
ఎన్నటికిని తరుగబోదు.
ఐకమత్యమును గూర్చును
కలహములను బోకార్చును

చింతలెల్ల బాపి మనకు
సంతసమును జేకూర్చును.
సందియముల నిది ద్రోలచును
బంధుమిత్రులను కూర్చును
మాయరాని సత్కీర్తిని
మనకిది ఘటియించు నిజము.
"విద్య తల్లి, తండ్రి, విద్యయె దైవంబు
గురువు, రమ్యరక్ష, కూర్చు హితుడు
విద్యకంటె దొడ్డ విత్తంబు మరిలేదు
విద్యలేనివాడు వింత పశువు"
అను పలుకులు వినలేదా ?

కొడుకు :

బాగుంది ! బాగుంది !
అయితే మరి నాన్నగారూ !
ఈ యేర్పాటుల చేసిన వా
రెవరండీ మన యూరిలో?

తండ్రి :

నిరక్షరాస్యతను
నిర్మూలన జేయాలని
గ్రామాలలో నివసించే
వయసులు ముదిరిన యట్టి
మగువలకును మగవారికి

చదువులు నేర్పించుటకై
ప్రాంతీయ ప్రభుత్వమువారు
పెద్దల విద్యా కేంద్రాలను
నెలకొల్పిరి గ్రామాలలో.

కొడుకు :

అదా అండీ నాన్నగారూ !
అర్థమయిం దిప్పుడు
పెద్దల చదువుల బడులను
ప్రభుత్వం నడిపిస్తుందని
ఊరిలోని స్త్రీ పురుషులు
వీన జేరి చదవొచ్చని
చదివి తెలివిని సంపాదించి
సుఖముగ జీవించ వచ్చునని.

— శ్రీ కాపొల్లి వెంకటేశ్వర్లు

## తెనుగు తల్లి బిడ్డలం

తెనుగుతల్లి బిడ్డలం
తెనుగుగడ్డ యువకులం
తెనుగుతల్లి సేవకొరకు
తెగువచేసి చదువుతాం ॥ తెనుగు॥

చిన్నతనమునందు మా
కన్నవారి మాట వినక
ఎన్నో ఆటలాడి నే
డెన్నో బాధలొందినాం ॥ తెనుగు॥

డొక్కశుద్ధిలేనివాడు
చిక్కపడును లెక్కలందు
ప్రక్కనున్నవారితోడ
ఒక్కటిగా మెలగలేడు ॥ తెనుగు॥

చదువు లేక మేము నేడు
సంఘయశము నందలేదు
చదువుకుంటె మేముకూడ
పదవిపేరు లందుతాం ॥ తెనుగు॥

యువకులైన మాకు నేడు
ఓటునిచ్చు హక్కువుంది
విద్యనేర్చి ఓటు విలువ
తెలుసుకొని మెలగుతాం ॥ తెనుగు॥

మేముచేయు పనులలోన
సారమెరుగ చదువ వలయు
సారమెరిగి మాదువృత్తి
చక్కదీర్చి దిద్దుతాం ॥ తెనుగు॥

విద్యలేనివాడు దేశ
వృద్ధికొరకు పోరలేడు
విద్యనేర్చి దేశ యశము
విశ్వమందు చాటుదాం ॥ తెనుగు॥

— శ్రీ నర్రావుల

## నిరక్షరాస్యత నిర్మూలింపుడు

నిరక్షరాస్యత నిర్మూలింపుడు
విద్యావ్యాప్తిని చేయండోయ్ ॥నిర॥

గుడులే బడులు గోడలె పలకల్
పాటలె పాఠాల్ మాటలె చదువు
వార్తాపత్రిక కాలక్షేపం ॥నిర॥

చెట్టుచేమల చేరి చదివిరి
పుట్టుపూర్వోత్తరాలనుండి
తాతలు తండ్రులు వ్రాత చదువులను ॥నిర॥

విద్య నేర్చి విశ్వం బేలండీ
స్వాతంత్ర్యంబును చక్కదిద్దుకొన
మేటి సాధనము చదువని యెరిగి ॥నిర॥

— శ్రీ చివుకుల శేషశాస్త్రి

## విద్యాదానము

సేయరా! సేవ సేయరా!
సేయరా! సేవ సేయరా!

వేయి మాటలు సెప్పుట కంటే
చేయరా ఒక మంచికార్యము
చేయవలసిన పనులు చాలు
న్నాయి – శక్తికి తగినదేదో ॥సేయరా!॥

చదువుకొంటివి వృద్ధికోరకా
చదువునే కొందరికి నీవు
చక్కగా నేర్పినచో చాలును
చాలు నదె పదివేలు తలపగ ॥సేయరా॥

దానముల కన్నిటికి విద్యా
దానమే కడు గొప్పదని సు
జ్ఞానులనా రరసినావా ?
జ్ఞానముతో నీ దేశమునకై ॥సేయరా॥

— శ్రీ రేమిడిచర్ల

అనుబంధము ౧.

## రచయితల సూచిక

# రచనల సూచిక